## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com.
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) **- సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com

Free Download Indian epic

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

Dwarkadheesh Vastu

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

### Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

You Tube

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సకల పురాణ వేత్తయైన సూతుని శౌనకాది మహామునులు, బ్రహ్మాండపురాణ విశేషములు చెప్పుమని యడుగగా ఆతడు గురువులకును దేవతలకును వందనములు చేసి యిట్లు చెప్ప నారంభించెను.

ఓ మునులారా! " బ్రహ్మాండ చరితోక్తత్వాత్ బ్రహ్మాండమితి కీర్తితమ్ " (బ్రహ్మాండము యొక్క చరిత్రను చెప్పుటచే ఇది బ్రహ్మాండపురాణమని ప్రశంసింపబడెను) అని వ్యాసభగవానుడే దీనిని ప్రశంసించెను.

ఈ పురాణమును జదివినచో మన పూర్వయుగములవారు, కల్పములువారు ఎట్లు బ్రతికినారో, వారి జీవన విధానమెట్టిదో, ప్రపంచమెట్లు పురోగతిని సాధించుకొన్నదో, మనుష్యుల ఆచారవ్యవహారము లెట్లు మార్పు చెందుచు వచ్చినవో తెలియును.

ప్రపంచ సృష్టి

లోకములన్నియు నశించి ప్రపంచము జలమయమై యున్నప్పుడు పరబ్రహ్మమునకు సృష్టి చేయు సంకల్పము గలిగెను. దానితో పూర్వ కల్పములలో నున్న విధముగానే సృష్టి ప్రారంభ మయ్యెను. అటువంటి ప్రారంభ స్థితిలో మానవులలో జాతి మత వర్ణ వర్గ భేదములు లేవు. పశుపక్ష్యాది జంతువులు గూడ ఎక్కువగా లేవు. కందమూలములు, పండ్లు, కాయలు, ఆకులు ఇవే ఆహారముగా ఉపయోగింప బడెడివి. ఇవిజ్ఞానమునువృద్ధిచేయుసాత్త్వికాహారములుకావునమానవులువానినేయుపయోగించెడివారు. భూమిమీది వాతావరణము ఎక్కువ శీతలముగాక, యెక్కువ ఉష్ణముగూడ కాక సమానముగా నుండెడిది. ఆనాటి మానవులు తపశ్శక్తి సంపన్నులు.

సంకల్ప మాత్రముననే వారు కోరినవి లభించెడివి. వారికి భూమినుండి స్వర్గమునకు గాని పాతాళ లోకమునకు గాని అవసరమైనప్పుడు వెళ్ళగలిగిన సామర్థ్య ముండెడిది. వారి వయస్సు గూడ చాల సంవత్సరములుండెడిది.అల్పాయుష్కులు కారు. వారు సంకల్పించినచో సృష్టికి అనుసృష్టియు, ప్రతిసృష్టియు చేయగలిగి యుండెడివారు. దేవతలతో సమానమైన రూప సంపదలు, మహానుభావములు గలవారు పుట్టుచుండెడివారు. ఈర్ష్యాసూయలు లేక, పరస్పర మైత్రితో చాలవరకు జీవనము గడచిపోయెడిది. చాల కాలము ఈ రీతిగా గడచెను. తరువాత తరువాత మానవులకు తపశ్శక్తి, మానస (సంకల్ప) శక్తియు సన్నగిల్లుచు వచ్చెను. ఇది కృతయుగము సంగతి.

త్రేతాయుగము ఆరంభమయ్యెను. మేఘములు వర్షించుటయు, నదులు ప్రవహించుటయు జరిగెను. ఇవి ఆ కాలములో వింతైన విషయములు. అప్పుడు ఆ మనుష్యులు దట్టముగానున్న వృక్షచ్ఛాయలలోనే నివసించుచు కాలక్షేపము చేసిరి. అంతకు ముందు ఆడువారికి ఎపుడో వయసు మరలెడు వేళ ఋతు ధర్మము కలిగెడిది. త్రేతాయుగమున స్త్రీలలోనెలనెలకుఋతుధర్మములు(బహిష్టు ఆగుట)కనబడ సాగినవి. కృతయుగము వారు వృక్షముల నుండి పండ్లు, వస్త్రములు, ఆభరణములు సంపాదించుకొనెడివారు. పూలనుండి తేనెయు, పండ్లనుండి రసములును కారి, కాలువలుగా ప్రవహించుచుండగా అప్పటివారు వానిని కడుపునిండ త్రావి, పండ్లు తిని తృప్తి పడెడువారు. వారెప్పుడును వస్తువులను, ఆహార పదార్థములను నిలువ యుంచుకొను అలవాటు లేక ఏరోజు తిండి ఆరోజే సంపాదించుకొని తినుచుండెడివారు.

కాలము గడచిన కొలది మనుష్యులలో లోభగుణము పుట్టి రేపటికి, కాదు నెలకు, కాదు సంవత్సరమునకు, కాదు జీవిత పర్యంతము ఉపయోగించుకొనుటకు కావలసిన వస్తువులను జాగ్రత్త పెట్టుకొను స్వభావము అలవడెను. దానితో ఒకరితో ఒకరు పోటీ పడు స్వభావ మేర్పడెను. క్రమముగా అది స్వార్థ చింతనకు దారి తీసెను. అహంకార మమకారములు దినదినాభివృద్ధి నొందెను. ఆ మనుష్యులు బలవంతముగా చెట్లనుండి తేనెలును, పండ్లు మున్నగు ఇతర వస్తువులను గ్రహింపసాగిరి. వానికే కల్పవృక్షములని పేరుండెడిది. క్రమముగా వృక్షసంతతి క్షీణింపసాగెను. దానితో ప్రజలకు నిత్యావసర వస్తువులకు కఱవు ఏర్పడెను. వానికై యితరత్ర అన్వేషణము ప్రారంభ మయ్యెను.

**గృహాది నిర్మాణము**

చెట్ల క్రింద నివసించు వారికి వేసవిలో తాపము వలనను, శీతకాలములో చలి వలనను, విశేషించి వర్షాకాలములో వానల వలనను బాధ లెక్కువ యగుచు వచ్చినవి. వృక్షముల వలన ప్రయోజనము తగ్గినప్పటినుండి జంతువులను వేటాడి మాంసాహారముతీసికొనుటఅలవాటైనది.బుద్ధిమంతులందరుసమావేశమైగృహనిర్మాణము తప్పనిసరి యని యామోదించిరి. దానికి దగిన ఉపాయములను అన్వేషించిరి. గృహములు కట్టుకొనుటలో సౌకర్యముల నాలోచించిరి. గృహములు నిర్మించు పద్ధతులతో వాస్తుశాస్త్రమును రూపొందించుకొనిరి. అన్నిచోటులందును నదులు, సరస్సులు ఉండవు కనుక నూతులు, చెఱువులు త్రవ్వి జల వసతు లేర్పాటు చేసికొనిరి.

### గ్రామ నగర నిర్మాణము

గ్రామములు, పురములు, నగరములు, మహానగరములు అను పేరులతో ఒక క్రొత్తదైన సృష్టి చేసికొనిరి. ఇండ్లు ఎవరి ఇష్టము వచ్చినట్లు వారు కట్టుకొనరాదు. శాస్త్ర పద్ధతిలో కొలతల (హస్తాది ప్రమాణముల) ప్రకారమే కట్టవలెనని నిర్ణయించిరి. ప్రజలు నడచుటకు మార్గము లేర్పరచుకొనిరి. సర్వసౌకర్యములు నేర్పరచుకొని ఆ యిండ్లలో సుఖముగా నివసించిరి. మానవజాతి వృద్ధి యయ్యెను. అడవులు గూడ తగ్గెను. వానినుండి వచ్చు ఆహార పదార్థములు గూడ క్షీణించెను.

### వ్యవసాయము

పెరుగుచున్న ప్రజాసంఘమునకు వృక్షములనుండియు, జంతువుల నుండియు వచ్చు ఆహార పదార్థములు చాలుట లేదు.మేధావులందరును సునిశితముగా ఆలోచించిరి. చెట్లనుండి పడిన గింజలు మొలకెత్తుట వారు గమనించిరి. విత్తనములు జల్లి సస్యములు పెంచుట నేర్చిరి. వరిధాన్యము, గోధుమలు, యవలు, ఇతరములైన దినుసులు ఆవిధముగా పండించుట మొదలుపెట్టిరి. మానవులలో కొందరు, మాంసాహారము పాపమని విడిచిపెట్టి కేవలము శాకాహారులైరి. మరికొందరు, మాంసశాకములను రెండింటిని దినుచు ఉభయాహారులైరి.

### ప్రభుత్వ వ్యవస్థ

పంటలు పండించుకొనుటకు భూములు కావలసి వచ్చెను. ఆ భూములకై ప్రజలు తగవు లాడకుండ చూచుటకు ఒక నాయకు డవసరమయ్యెను. దానితో రాజరికపు వ్యవస్థ బయలుదేరినది. అతనికి సైనిక బలమును, ఆర్థిక బలమును అవసర మయ్యెను. రాజధర్మములు, ప్రజాపరిపాలన విధానములు, రాజనీతి శాస్త్రములు రచింపబడినవి. ధర్మమును నాలుగు పాదములతో నడిపించుచు ప్రజలను సమాన దృష్టితో జూచు రాజును ప్రజలు దేవునిగా కొలిచిరి. ఆయన యాజ్ఞలను తలదాల్చిరి. కొంతకాల మిట్లు గడచెను. రాజులలో ధర్మమును, నీతియు కొరవడినవి. త్రేతాయుగము గడచి ద్వాపరయుగము వచ్చునాటికి రాజులు శాస్త్రములను, ఆచారములను ఉల్లంఘించుటకు ఆరంభించిరి. వ్యవస్థ అంతయు తలక్రిందులైనది. కల్లోలములు పుట్టెను.

వర్ణాశ్రమాచారములు

అట్టి సమయములో బుద్ధిమంతులైనవారు సంఘక్షేమమునకై కొన్ని కట్టుబాటు లేర్పరచినారు. బ్రాహ్మణులు అధ్యయనము - అధ్యాపనము, యజనము - యాజనము (యజ్ఞములు చేయుట, చేయించుట) దానము - ప్రతిగ్రహము అను ఆరు కర్మములను చేయుచుండ వలెననియు, క్షత్రియులు అధ్యయనము, యజనము, దానము చేయుచు తమ భుజబలముతో ప్రజలను ఆపదల నుండియు, శత్రువుల నుండియు రక్షించుచుండవలె ననియు, వైశ్యులు అధ్యయన, యజన, దానములతోపాటు వ్యవసాయము, వాణిజ్యము కూడ చేయుచుండ వలెననియు, శూద్రాది వర్ణముల వారు పశుపోషణము కూడ చేయుచుండ వలెననియు, శూద్రాది వర్ణములు వారు పశుపోషణము చేయుచు వ్యవసాయాది వృత్తులలో పైవారికి సహకరింపవలె ననియు నియమము లేర్పరచిరి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను ద్విజులు అనిరి. ఇవి అన్నియు ఆనాడు ప్రజల ఆమోదమును పొందెను. కొంతకాల మీ వ్యవస్థ యిట్లు సాగినది. తరువాత వీనిలో చాల మార్పులు వచ్చెను.

పరిశుభ్రత - ఆరోగ్యము

నీరు, నిప్పు, గాలి, భూమి, ఆకాశము - వీనిని పంచభూతములందురు. సూర్యుడు, చంద్రుడు, దీక్షితుడు అనువారితో గలిపి శివుని అష్టమూర్తులు అందురు. వీరితోమనకునిత్యముపని యుండును. అయితే, వీరి నారాధించుటలోకొన్ని నియమములు ఏర్పరచిరి. అవియే ఆరోగ్య సూత్రములయ్యెను. ఉదయించునపుడును అస్తమించునపుడును సూర్యుని జూడకూడ దనిరి. చూచినచో అతని అతినీలలోహిత కరణముల వలన (అల్ట్రావైలెట్ రేస్) కన్నుల చూపునకు దెబ్బ తగులునని అట్లు చెప్పినారు. సూర్యోదయమునకు ముందే నదీ నదములలో స్నానము చేయవలె ననిరి. సూర్యచంద్రులకు అభిముఖముగా గూర్చుండి మలమూత్ర విసర్జనము చేయరాదనిరి. ఇట్టివెన్నియోమహర్షులుప్రజాక్షేమమునకైశాస్త్రములుగా రచించి పెట్టిరి.అవి యన్నియు ఈ పురాణములో నున్నవి.

భూమండలము

ఈ పురాణములో భూమండలములో ఎన్ని ద్వీపము లున్నవో, వానిని చుట్టియున్న సముద్రములు, పర్వతములు, నదులు, ప్రజలు, వారి ఆహారములు, శరీరపు రంగులు, వారి ఆయుర్దాయములు అన్నియు వర్ణింపబడినవి.

ఆయా ద్వీపములలో అట్లు వేరువేరు ప్రవృత్తు లుండుటకు వాని శీతోష్ణ పరిస్థితులే కారణము. ఏ యంత్ర సహాయమును లేకుండగనే యిన్ని మహావిషయములు వారు తపశ్శక్తిచేత కనుగొనగలుగుట మనకు ఆశ్చర్యమనిపించక మానదు.

**ఖగోళములు**

జ్యోతిశ్శాస్త్రమునకును, పురాణములకును ఈ ఖగోళ విషయమున భేదములు కనిపించుచున్నవి. భూమికి దగ్గరగా సూర్యుడును, ఆపైన చంద్రుడునున్నట్లు వర్ణింపబడినది. ఇట్టి వైరుధ్యములు కొన్ని ఉన్నవి. అయితే కొన్ని విషయములు చెప్పునపుడు మధ్యలో కొన్ని శాస్త్రములు ప్రసంగము వచ్చును. అంత మాత్రము చేత ఆ చెప్పినవే సిద్ధాంతములు అనుకొనుటకు వీలులేదు.

**జగత్ సృష్టి**

సత్వరజస్తమోగుణములు సమానములైన పాళ్ళలో నున్నప్పుడు అది ప్రళయ స్థితి. ఆ గుణములే ఎక్కువ తక్కువ లైనపుడు వివిధ వస్తువుల సృష్టి జరుగును. త్రిమూర్తులలో విష్ణువు సాత్వికమూర్తి, బ్రహ్మ రజోగుణమూర్తి, శివుడు తమోగుణమూర్తి. అయినను ఒక్కొక్కప్పుడు అవసరమును బట్టి త్రిమూర్తులలోను ఆ గుణములు మూడును ఎక్కువ తక్కువలుగా ప్రకాశించును. అయినను వారి ముగ్గురిని భేదబుద్ధితో జూడరాదు.పరబ్రహ్మమే సృష్టిస్థితిలయములు చేయుటకై మూడు రూపములతో ఉన్నాడని గ్రహింపవలెను. అతడు ప్రళయ కాలమున ఆత్మోపాసనాపరుడై నిద్రించును. మేలుకొన్న పిమ్మట జగత్సృష్టి కావించుటకు భూభాగ మేమియు కనబడలేదు. జలగర్భములో నున్న భూమిని సముద్ధరించుటకై తాను శ్వేత వరాహ రూపమును ధరించెను.ఆశ్వేతవరాహముయజ్ఞస్వరూపమును,వేదస్వరూపమును అయి యుండెను. ఆ వరాహమూర్తి రసాతలమునకు బోయి పూర్వము వలెనే భూమిని సముద్రమున నీళ్ళపై తేల్చి నిలిపి, సముద్రమధ్య ద్వీపములను సముద్రమునందును, నదుల మధ్య ద్వీపము (లంక)లను నదులయందును ఉండునట్లు చేసెను. పూర్వము ప్రళయ కాలమున అగ్ని దగ్ధములై బూడిదగా మారిన పర్వతములను వాయువులతో సహా పైకెత్తి తనయాత్మ శక్తితో భూమండలమును యథాపూర్వముగా నిలిపెను.అపుడు బ్రహ్మభావనచేసిఆపరమపురుషుడు(తానే బ్రహ్మగా) సృష్టి నారంభించెను. విష్ణుభావన చేసివిష్ణువై పరిపాలన చేసెను. శివ భావనతో శివుడై సృష్టినెప్పుడో లయము చేయును.

కడచిన కల్పములలో సృష్టియెట్లు జరిగెనో అట్లే యీ శ్వేతవరాహ కల్పమున గూడ బ్రహ్మ సృష్టిక్రియను జేయును. బ్రహ్మ తన ముఖము నుండి సృష్టి వృద్ధి నొందుటకై వేయిమంది దంపతులను సృజించెను. వారందరును సత్వ గుణప్రధానులై ప్రతిసృష్టి చేయుచునేతపస్స్వాధ్యాయవ్రతనిష్ఠులైయుండిరి. తరువాత బ్రహ్మ తన చూపులనుండి మరి వేయిమంది దంపతులను సృజించగా వారు రజోగుణ ప్రధానులై ధర్మప్రవృత్తి గలిగియుండిరి. ఇంకను బ్రహ్మ తన శరీరమునుండి బహుసహస్రముల దంపతులను సృజించగా వారు తమో గుణప్రధానులై, సంసారమున బడి మునిగి తేలుచు మరల మరలజన్మములెత్తుచునుందురు.బ్రహ్మయిట్లుప్రతిసర్గము(తాను సృష్టించిన వారినుండి మరల సృష్టిజరుగుట) సాగుచుండుటను జూచి తాను విశ్రాంతి గైకొనును.

అగ్ని సంతానము

బ్రహ్మమానసపుత్రుడు అగ్ని. అతని భార్య పేరు స్వాహాదేవి. వారికి పావకుడు, పవమానుడు, శుచి అను ముగ్గురు కుమారులు పుట్టిరి. అరణియందు మథింపగా బుట్టినవాడు పవమానుడు. మెఱుపులతో నుండువాడు పావకుడు. సూర్యుని తేజస్సులో నుండువాడు శుచి.

పవమానుని కొడుకు కవ్యవాహుడు పితృదేవతలయందు ప్రీతి గలవాడై యుండును. పావకుని కొడుకు సహరక్షుడు. ఇతనికి రాక్షసు లన్నచో ప్రీతి. రాక్షస యజ్ఞములలో నుండును.

శుచికుమారుడుహవ్యవాహుడు.ఇతడు దేవతాగణములందుప్రీతిగలవాడై యజ్ఞములలో వారివారి హవిర్భాగములను దెచ్చి యిచ్చుచుండును.

ఈ ముగ్గురివలన అగ్ని సంతానము బహువిధముల వ్యాప్తి చెందినది.

పితృదేవతలు

బ్రహ్మ మానసపుత్రు లనేకులు జనించిరి. కాని వారెవరును తమను సృజించిన బ్రహ్మను తండ్రిగా భావించిన వారులేరు. బ్రహ్మగారి ముఖమునుండి జనించిన ఒక దేవతా వర్గము, బ్రహ్మదేవుని తండ్రిగా భావించి స్తుతించెను. అపుడు బ్రహ్మదేవుడు నన్ను తండ్రిగా భావించి మన్నించినారు గావున మీరు పితృదేవతలని పిలువబడుదురని వారి కొక పేరు పెట్టెను. ప్రతి మనువు కాలములోను వీరుందురు. ఋతువులే పితరులని వేదము చెప్పెను.

" ఋతవః ఖలువై దేవాః పితరః " .

ఈపితృదేవతలు అగ్నిష్వాత్తులనియు, బర్హిషదులనియు రెండు వర్గములుగా నుందురు.

వసంత ఋతువున గల మధుమాధవమాసములను (చైత్ర, వైశాఖములను) రసములు అనియు, గ్రీష్మర్తువునందుగల శుచిశుక్ర (జ్యేష్ఠ ఆషాఢ) మాసములను శుష్మములనియు, వర్షర్తువు నందుగల నభము నభస్యము (శ్రావణ భాద్రపదములు) అనువానిని జీవన (హేతువులు)ములు అనియు, శరదృతువునందుగల ఇషమును ఊర్జమును(ఆశ్వయుజకార్తికములు)స్వధావంతములనియు,హేమంతఋతువుననుండు సహము,సహస్యము(మార్గశిర పుష్యములు) లను ఘోరములనియు,శిశిరఋతువులోని తపము, తపస్యము అను (మాఘఫాల్గున) మాసములను క్రోధములనియు చెప్పుదురు. ఈ ఋతువులే దివా, రాత్ర, పక్ష, మాస, సంవత్సరములకు కారణ భూతములైన కాల ప్రమాణములు. మూడు ఋతువులొక ఆయనము. ఉత్తర దక్షిణాయనములు రెండును గలిసినచో సంవత్సర మగును. ఋతువులకు అయిదుగురు పుత్రులు గలిగిరి. వారినిఋతములందురు.వారుఋతువులననుసరించిస్థావరజంగమస్వరూపులైయుందురు. ఋతుసంభవములైన వస్తువులును, మార్పులును ఆర్తవము లనబడును. ఆర్తవములను పితరులు(తండ్రులు)గాను,ఋతువులనుపితామహులు(తండ్రికి తండ్రి - పితామహుడు) గాను చెప్పుదురు.

మనువుల నుండి బుట్టినవారికి బ్రహ్మదేవుడు పితామహుడే గదా!అట్లే ప్రజలకు సంవత్సరము ప్రపితామహుడు. " ప్రజాపతిస్సంవత్సరః"అను శ్రుతిని బట్టి సంవత్సర స్వరూపుడే ప్రజాపతి. అతనికి అగ్నిఋతుడను కుమారుడు కలిగెను. అతని వలన ఋతువులు పుట్టెను. ఋతువుల వలన ఆర్తవములు కలిగెను. ఋతుసంబంధమైన వస్తువులు మనలను పోషించును గనుక మనకు పితరులు. వీనిలో వచ్చు వివిధములైన మార్పుల వలన భూతములు (ప్రాణులు) పుట్టుచుండును.

పితృదేవతలు అగ్నిష్వాత్తులు, బర్హిషదులు అను రెండు తెగలుగా వృద్ధి పొందిరి. పితృదేవతల భార్య స్వధాదేవి. ఆమెయందు అగ్నిష్వాత్తులకు మేనయను కుమార్తెయు, బర్హిషదులకు ధారిణియను కుమార్తెయు గలిగిరి. మేనను అగ్నిష్వాత్తులు హిమవంతుని కిచ్చి పెండ్లి చేసిరి. ఆమెకు మైనాకుడు గంగ అను పిల్లలు పుట్టిరి. ధారిణిని బర్హిషదులు మేరు పర్వత రాజున కిచ్చి పెండ్లి చేసిరి. వారికి మందరుడు అను కుమారుడును, వేల, నియతి, ఆయతి అను కుమార్తెలును గలిగిరి.

మేరువు, వేలను వరుణునికిని, నియతిని విధాతృనకును, ఆయతిని ధాతకును ఇచ్చి పెండ్లి చేసెను. వేలాసముద్రులకు సవర్ణియను పుత్రిక పుట్టెను. ఆమెను ప్రాచీనబర్హి యను రాజునకిచ్చి పెండ్లి చేయగా వారికి ప్రచేతసులనెడి పదిమంది కొడుకులు పుట్టిరి. ఆ ప్రచేతసులు మారిషను పెండ్లాడిరి. వారికి ఈశ్వర శాపముచేత దక్షుడు కుమారుడుగ బుట్టెను. ఇది దక్షుని జనన ప్రకారము.

సూర్య రథము

సూర్యుని రథములోని భాగములు సంవత్సరములోని విభాగములే. ఒకే చక్రము గల యీ రథమునకు పగలు నాభి (బండి కంటి మధ్య గల తూము). పంచాయుధములు (ప్రాతః, సంగవ, మధ్యాహ్న, అపరాహ్ణ, సాయంకాలములు అను పగటి విభాగములు) చక్రములోని ఆకులు. ఆరు ఋతువులు నేమి (బండి కంటి దగ్గర నుండు కమ్మి), రెం డయనములు బంటి తొట్టెఃకళలు, ముహూర్తములు ఇతర భాగములు. కాష్ఠలు ముందరి ముక్కు, క్షణము అక్షదండము. నిమిషములే పగ్గములు. రాత్రి వరూథములు (చక్ర రంధ్రాలలో దూర్చు నెమ్ములు), ధ్వజము ధర్మము. అర్థకామములు ఇరుసులు. గాయత్రి, త్రిష్టుప్పు, అనుష్టుప్పు, జగతి, పంక్తి, బృహతి, ఉష్ణిక్కు లనెడు ఏడు ఛందస్సులును గుఱ్ఱములు. చక్ర నాభి ధ్రువునితో బంధింపబడి యుండును.ధ్రువుడుఈసూర్య(కాల)చక్రమునుత్రిప్పుచుండును.అతనినిపరివేష్టించి సప్త మహర్షులును ఉందురు. ఈ సూర్యుని వలన కాలచక్రముతిరుగుటయే కాదు. ఇతడు తన కిరణములతో భూమిమీదను, సముద్రములోను ఉండునీటి నాకర్షించి చంద్రుని యందుంచును. అతడు ధూమరూపములైన మేఘముల యందుంచును. నీటిని ధరించుట చేతనే వానికి వారివాహములు, అని పేరు వచ్చెను. అవి వాయువుల చేత ప్రేరేపింపబడి, భూమి నదీ పర్వత సాగరములందు వర్షించును. నీటి నిచ్చునవి కనుక వీనిని అభ్రములు అందురు. " తదభ్ర మివ సమహన్యత ' 'అని శ్రుతి వాక్యము. ఇవి సస్యములు పెరుగుటకు కావలసిన నీటి నిచ్చును. ఇట్లే సర్వ జగత్ సృష్టియు జీవించుటకు ఆ సూర్యుడే ఆధారము. "సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ"అని శ్రుతి. అందుచేమునులు,విద్వాంసులుసూర్యారాధనముచేయుదురు.ఆదిత్యాదినవగ్రహములు గూడఆధ్రువునిచుట్టునుతిరుగుచుప్రక్కవానినిగూడతమ యాకర్షణశక్తిచే త్రిప్పుచుండును. నక్షత్రములును ఇంతే. వీనివలననే రాసులు, గ్రహ నక్షత్ర సంచారములును ఏర్పడినవి.

**లింగోత్పత్తి**

ఒకప్పుడు శ్రీ మన్నారాయణుడు పాలసముద్రములో శేషునిపై పరుండి యుండెను. ఆ సమయమున దేవతలు అచటికి వచ్చిరి. నారాయణుని దర్శించి, నీ కరుణాకటాక్షము వలన మాకు బలిచక్రవర్తి పీడ వదలినది. నీవు వామనుడవై బలిచక్రవర్తిని పాతాళమునకు బంపితివి. నీ మహిమను మే మెట్లు పొగడగలము?"అని వినుతింపగా, శ్రీహరి వారిని జూచి, "దేవతలారా!నీకీ మహిమ యంతయు పరాత్పరుడైన పరమేశ్వరుని కరుణవలన గలిగినది. అతడే సమస్త జగములకు పరిపాలకుడు. ఒకప్పుడు ప్రళయసముద్రములో నేను ఒంటరిగా స్వతంత్రుడనై మఱ్ఱియాకులో బండుకొని యుంటిని. అప్పుడు నేను సహస్ర శిరస్సు లతోను,సహస్ర బాహువులతోను,సహస్రపాదములతోనుఉంటిని.అప్పుడునా ముందు ఒక మహాతేజస్సు కనబడినది. క్రమముగా ఆ తేజస్సులో, నాలుగు ముఖములు గలవాడును. బంగారు రంగు శరీరకాంతి కలవాడును, కృష్ణాజిన, కమండలములు ధరించినవాడును అగు ఒక మహాపురుషుడు కనిపించెను. అతడు నా వద్దకు వచ్చి, "నీవెవ్వడవు?ఒంటరిగా మహాసముద్రములో నున్నావు?నేను స్వతంత్రుడనై సృష్టి చేయగల బ్రహ్మను. నేను స్వయంభువుడను.సృష్టి స్థితి సంహారకుడను గూడ నేనే"అనగా నేను "ఓ చతుర్ముఖుడా! వినుము.నీవేసర్వస్వతంత్రుడవనివిఱ్ఱవీగుచున్నావు.అసలునేనేసృష్టిస్థితిలయకారకుడను. లేనిపోని గొప్పలు చెప్పకొనకుము"అని మందలించితిని. దానిపై అతనికి నాకును పెద్ద వాగ్వాదము జరిగెను. ఇంతలో మా యెదుట నొక మహాతేజస్సు ఉత్తరదిశనుండి వచ్చి నిలిచెను. అది క్రమముగా శిరమున చంద్రుని దాల్చియున్నట్లు కనబడెను. బ్రహ్మయు నేనును దాని దగ్గరకు పోయితిమి. అది యొక మహాలింగముగా కనిపించెను. దాని మూలముగాని అగ్రముగాని తెలియుట లేదు. అపుడు బ్రహ్మ నాతో, "దీని మూల మేమో అగ్రమేమో మనము తెలిసికొనవలెను. నీవు క్రిందికి పోయి మూలమును కనుగొని రమ్ము. నేను పైకి బోయి అగ్రమును కనుగొని వచ్చెదను"అని చెప్పగా నేను అంగీకరించి మూలమును వెదకుచు పోవసాగితిని. అట్లొక వేయి దివ్యసంవత్సరములు ప్రయాణముచేసినను, నాకు మూల మెక్కడో కనిపించలేదు. ఇదేదో మహావిషయమని భావించి వెనుకకు మరలి పూర్వము బ్రహ్మతో మాట్లాడిన చోటికి వచ్చితిని. బ్రహ్మ కూడ అక్కడకువచ్చెను.నేనులింగము మూలమును చూడలేకపోయితినని సత్యము చెప్పితిని.

బ్రహ్మకూడదానిఅగ్రముచూడలేకపోయితిననిచెప్పెను.మాగర్వములు అణగిపోయినవి. పరమేశ్వరమాయావి మోహితులమై ఏమి చేయుటకును తోచక," ఓ సర్వాధారుడవైన పరమేశా!మమ్ము రక్షింపు"మని ప్రార్థించితిమి. కొంచె మాలోచించి "అనంతుని ధ్యానము చేయవలెను గాని యిట్లు భయపడి ప్రయోజనము"లే దనుకొని ధ్యానిమగ్నులమై అతని అనంతతత్వమును బహువిధముల స్తుతించితిమి.

అపుడు మా యెదుట కోటి సూర్యుల కాంతితో, పినాకము, త్రిశూలము, పాప జందెమును దాల్చి శివుడు ప్రత్యక్ష మై, మహాట్టహాసము చేసెను. దానికి మేము భయ మంది వణకిపోయితిమి. పరమేశ్వరుడు మమ్ము జూచి, "భయ మేల?మీరు నా నుండి పుట్టినవారు. కుడిచేతినుండి బ్రహ్మయు, ఎడమచేతినుండి విష్ణువును జనించినారు. మీరిద్దరును"నేనుగొప్ప,నేను గొప్ప"అని కలహించుచుండగాచూడలేక మీహితముగోరివచ్చితిని.మీస్తోత్రమునకుసంతోషించినాను.వరమిచ్చెదను కోరుకొండు"అనెను. మేము, "మీ పాదముల మీద భక్తి మా కెల్లప్పుడు నుండునట్లు అనుగ్రహింపుము"అనికోరగా,అతడావరమిచ్చి,"మీరింకసృష్టిచేయుటకారంభింపుడ"ని అనుమతి నిచ్చి అదృశ్యు డయ్యెను. అతని యనుగ్రహము వలననే నాకు దుష్టశిక్షణ, శిష్ట రక్షణము చేయు సామర్థ్యము కలిగినది. ఆ పరమేశ్వరునకు నమస్కారము"అని చెప్పి దేవతలతో గలిసి పరమేశ్వరుని స్తుతించెను.

**పరమేశ్వరుని దారుకావన విహారము**

హిమాలయపర్వతములలో దేవదారు వృక్షములతో నిండిన ఒక వనము గలదు. దానినే దారుకావనమని యందురు. అందులో మునీంద్రులు కొందరు ఆశ్రమములు స్థాపించుకొని తమ స్త్రీలతో కాపుర ముందుచు, తపములు చేసికొనుచుందురు. కొందఱు నీళ్ళలోపల నిలబడియు, కొందరు నీటిపై తేలుచు పండుకొనియు తపములు చేయుచుందురు. వారి ననుగ్రహించుటకై పరమేశ్వరుడు వికృతవేషముతో వచ్చెను. తల జడలు కట్టియుండెను. కోరలుండెను. దిగంబరుడుగా నుండెను. ఇట్టి వేషముతో మునులయొద్దకుబోయిగంతులువేయుచుఆర్పుచువారితపస్సులనుబాడుచేయుచుండెను. మునులు కోపించి, "గాడిదవలె కూసితివి గాన నీవు గాడిద జన్మ మెత్తు"మని యొకరును, "దానవుడవు గమ్ము"ని యొకరును, "పిశాచమవు కమ్మ"ని కొందరును శపించిరి. వారట్లు శపించగా శివుడు సంతోషించెను గాని, మనసులో బాధ పడలేదు, తిరిగి కోపించి వారి నేమియు అనలేదు.

ఏమి చిత్రమో కాని, ఆ పరమేశ్వరుని తేజస్సుముందు మునుల తపస్తేజస్సులన్నియు సూర్యునిముందు దీపముల వలె వెలవెలబోయెను.

మునుల శాపము లెట్టివో తెలియునుగదా!ఒక ముని శాపమున, బ్రహ్మకు లోకములో పూజలు లేకుండ పోయెను. మరియొక ముని శాపమున (భృగువు) విష్ణువు మత్స్యకూర్మాది అనేక అవతారము లెత్తవలసి వచ్చెను. అగస్త్యుని శాపమువలన ఇంద్రపదవి నొందిన నహుషుడు మహాసర్ప మయ్యెను. అటువంటి మునుల శాపములు, సర్వాధికుడైన పరమేశ్వరుని ఏమియు చేయజాలక పోయినవి.

ముని లందరును ఒకచోట చేరి, "ఇతడెవ్వడో కాని అధర్మముగా ప్రవర్తించుచున్నాడు. మునులను మాయాకూపములో ముంచినాడు. వీనిపై దయ చూపకూడదు. దండించవలెను.ముందుమంచిగాచెప్పిచూతము.విననిచోఅప్పుడేచూచుకొందము" అనుకొని, శివుని దగ్గరకు బోయి, "సంసార స్త్రీ లుండుచోట, కన్య లుండుచోట ఇట్లు దిగంబరుడవై తిరుగుట పనికిరాదు. బట్ట కట్టుకొనుము"అని చెప్పిరి. పైగా ఇట్లనిరి. " నీ విట్లు బట్టలు లేకుండ తిరిగినచో నీవు నీ పురుష చిహ్నమును పోగొట్టుకొందువు".

అది విని పరమేశ్వరుడు, "మునులారా!నాలింగము భూమిపై బడునట్లు మీరు శపించు టెందుకు?కేశవాదులకు గూడ అది సాధ్యము కాదు. నేనే స్వయముగా నా లింగమును భూమిపై విడచుచున్నాను."అనగా, ముని లిట్లనిరి. "నీ మహిమల సంగతి మాకేల? నీవు సరిగా బట్టలు కట్టుకొని, వెకిలి వేషములు వేయుట మానినచో ఇక్కడ నుండుము. లేదా, ఇచ్చట నుండి నీ యిచ్ఛవచ్చిన చోటికి బొమ్ము". ఈ మాటలు విన్న ఈశ్వరుడు వెంటనే అదృశ్యు డయ్యెను. చూడగా లింగరూపమే అచ్చట నుండెను. పరమేశ్వరుడట్లు అదృశ్యు డగుటచే త్రిలోకములు స్తంభించెను. ప్రాణులకు పుట్టుకలు లేకపోయెను. సృష్టిలోని సమస్త వస్తువులును నిస్తేజము లయ్యెను. అగ్నికి, సూర్యచంద్రులకు ప్రకాశము లేకపోయెను. నక్షత్ర గ్రహ సంచారములు విపరీతము లయ్యెను. మునుల యజ్ఞములు సాగుటలేదు. సాగినను ఫలములు దక్కుటలేదు. జీవుల సమస్త కార్యక్రమములు స్తంభించిపోయెను. దానికి కారణ మేమో తెలియక మునులందరును బ్రహ్మదగ్గరకు బోయి, ఈశ్వరుని వికృతవేషమును, దుండగములును, అతని దిగంబరత్వమునుజూచి మునికాంతలును, ముని కన్యలును మోహవిభ్రాంత లగుటయు సమస్తమునువివరించిరి.దానికిబ్రహ్మదేవుడు, "ఆయన ఆదిపురుషుడైన పరమేశ్వరుడు.

ఆయనవలననే మన మందరము బుట్టి జీవించుచున్నాము. ఇవన్నియు ఆయన లీలలు. ఎట్టి తేజస్సుతో ఈశ్వరుడు లింగముగా మారెనో ఆలింగమునుపరమేశ్వరస్వరూపముగా భావించి సేవించి ఇష్టసిద్ధులు బొందుడు"అని సెలవిచ్చి పంపివేసెను.

**కలి ధర్మములు**

కృతయుగములో జీవితపర్యంతము చేసిన పుణ్యముల ఫలము, త్రేతాయుగములో ఒక సంవత్సరము చేసినచో వచ్చును. ఆ ఫలము ద్వాపరములో ఒక నెలపాటుచేసినచోవచ్చును.అంతేఫలముకలియుగములోఒక రోజున చేసినచో వచ్చును.

కృత త్రేతాయుగములలో వేదములు ఒకే రాశిగా నుండగా ద్విజులు వాని నధ్యయనము చేయుదురు. ద్వాపరమున కొంత కాలము పాటు అట్లే జరుగును. ద్వాపరార్థము గడచిన తరువాత వేదము నాలుగు విభాగములుగా వేదవ్యాసునిచే చేయబడెను. అవి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము. ఆ నాలుగు వేదములను అధ్యయనము చేసి ఆ నాటివారు ఆ ధర్మములను చాలవరకు పాటించెడివారు.

ఆ తరువాత కలియుగము ప్రవేశించును. ప్రజలలో అసత్యము, హింస వృద్ధి యగును. అసూయ పెరుగును. కపటస్వభావము చాలమందిలో కనిపించును. సజ్జనులను హింసింతురు. రోగములు గలుగును. అధర్మము పెచ్చు పెరుగును. నూటి కొక్కడు ధర్మాత్ముడుండి అతడు చేసిన ధర్మముగాని చెప్పిన మాటగాని ప్రజల మెప్పు పొందదు. అతివృష్టి, అనావృష్టి కలుగును. దేశమునందు ఉపద్రవములు గలుగును.వేదశాస్త్రములు ప్రామాణ్యము క్షీణించిపోవును.

ఒకడు తల్లి గర్భములోనే మరణించును. ఒకడు వయసులో నుండగా మరణించును. మరొకడు ముసలితనములో చచ్చును. ప్రజలు దుష్టసహవాసములతో దుష్కార్యములుచేయుదురు.బ్రాహ్మణులువిధివిధానములుతెలియకచేసినకర్మదోషముల వలన చాల అనర్థములు, భయములు కలుగును. అసత్యము లాడు వారినే నెత్తిమీద పెట్టుకొందురు. అసూయాద్వేషములు సహజగుణము లగును. బ్రాహ్మణులు వేదములు పఠించరు. యజ్ఞములు కూడ చేయరు. క్షత్రియ వైశ్యులే కాక సర్వవర్ణముల వారును తమతమ ధర్మము లాచరింపరు.

ఒక విచిత్ర విషయము వినుడు. శూద్రాది వర్ణముల వారు చాల అభివృద్ధిలో నుండగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వారి యాశ్రయమునకై ప్రాకులాడుచు వారితో భోజనాదులు చేయుచుందురు. కులభ్రష్టత్వమును గూర్చియాలోచింపరు.పరిపాలకులు గూడ స్వార్థమును గూర్చియే కాని ప్రజాక్షేమమునుతలపరు. ఆయుర్దాయమునూరేండ్లు మాత్రమే యుండును. ధర్మబుద్ధి గలవారు చాల కొద్దిమంది యుందురు. వంశమర్యాదలు, శీలములు పూర్తిగానశించును.బ్రాహ్మణులుశూద్రులవలె ప్రవర్తింతురు. శూద్రులు బ్రాహ్మణులు చేయు పనులు బాగున్నవని చేయుచుందురు. రాజులే దొంగలుగా ప్రవర్తింతురు. సేవకులు స్వకృత్యములు మాని హీనమైన పనులు చేయుదురు. స్త్రీలు సత్యము, ధర్మము విడిచి మద్యము త్రాగుచు దుశ్శీలములు గలిగి ప్రవర్తింతురు. మాయా స్వభావములు గలిగి స్వేచ్ఛావిహారములు చేయుచుందురు.

కలి పూర్తి యగునప్పటికి పతివ్రతలు అను వారుండరు. స్త్రీలు తలలు విరియబోసికొని తిరిగుచుందురు. బ్రహ్మచర్యాది ఆశ్రమధర్మములు చాలవరకు నశించును. రాజులు, ప్రజలు కట్టిన పన్నుల సొమ్మును హరించి, తమ భార్యాపుత్రులకు ఇచ్చుచు సద్వ ర్తనము లేక యుందురు. బ్రాహ్మణులు శూద్రుల నాశ్రయించి జీవించుటేకాక వారికి పాదాభివందనములు గూడ చేయుచుందురు. భోజనప్రియులు, దొంగలు అగువారు, సన్న్యాసి వేషములతో తిరుగుచుందురు. వీరి సంఖ్య యెక్కువగా నుండును. విప్రులు వేదములనుఅమ్ముకొనిజీవింతురు.వీరు వారు అను భేధము లేక అన్ని వర్ణములవారును వాణిజ్యము చేసి జీవింతురు. మనుష్యులుశ్రమపడిసంపాదించిన పుణ్యమును ఇహలోక భోగములకై అమ్ముకొందురు. (ఖర్చుచేయుదురు). ఏ అథమవృత్తిని చేపట్టి యైనను భార్యాపుత్రులను పోషించుకొనుటే ప్రధానమని భావింతురు. అతిథులు, పండితులు ఇంటికి వచ్చినచో ఆతిథ్య మీయరు. చాలమంది జనులు నాస్తికు లయ్యెదరు. స్త్రీల సంఖ్య వృద్ధియై పురుషుల సంఖ్య తక్కు వై వ్యభిచారములు పెరుగును. ఉపకారము చేసిన వారికే అపకారము చేయువారు బహుళసంఖ్యలో నుందురు. పరమార్థ మన్నచో ద్వేషము ప్రబలును. నగరపాలకులు పావనశీలములు విడిచి ప్రజలనుండి ధనములు పుచ్చుకొనుచువారిక్షేమమునూలోచింపక,స్వేచ్ఛాప్రవర్తనులైపరకాంతా,పరధనాపహరణములపై ఆసక్తి చూపుదురు. మనుష్యులు విధినిషేధములు లేక అభోజ్యములైనవానిని గూడ తిని,మదమత్తులైయుండుదురు. మద్యపానము, స్త్రీ వ్యసనము అధికముగా నుండును.

శూద్రులు కాషాయవస్త్రములు ధరించి సర్వసంగపరిత్యాగుల వలె ప్రజలకు కనిపించుచుధర్మములన్నియుతమకేతెలిసినట్లుప్రజలకు బోధించుచు, అర్థకామాసక్తులై సంచరింతురు. దొంగలు దొంగతనమునకై పరుల యిండ్లకు బోగా, ఆ దొంగల యిండ్లలో మరొకడు దూరి ఉన్న వన్నియు అపహరించును. పాలకుడు (లేదా న్యాయమూర్తి) నీతి మార్గమునవలంబించి దండింపదగిన దోషిని దండించుటకు (శిక్షించుటకు) సిద్ధపడినచో, ఆ దోషియే మాత్రమును భయములేక న్యాయమూర్తినే దండించి స్వేచ్ఛాగా తప్పించుకొనిపోవును. మానవులు తాము సర్వజ్ఞుల మనుకొనుచు వినయ వివేకములు లేక, పెద్దలు చెప్పినది వినక స్వేచ్ఛాప్రవృత్తి కలవారై సంచరింతురు. బద్ధకస్థులు ఎక్కు వైపోవుదురు. దానికి తోడు ఆశలు కూడ పెరిగి, అధర్మమార్గమున సంపాదించుటకు సిద్ధపడుదురు. కలియుగము చివరకి వచ్చునపుడు ఎలుకలు, మహాసర్పములు పెచ్చుపెరిగి,ప్రజలకుభయమునుగలిగించును.ప్రజలకుక్షేమముండదు.బహువిధములైన రోగములు ప్రజలను పీడించును. మానసికమైన చింత లెక్కువగును. జనులు వీనితో చిక్కి శక్యము లగుదురు. వేదశాస్త్రములే ఆ ప్రజలకు భయపడి దూరముగా పోయినట్లు, వాని వాసనలు గూడ కనిపించకుండ పోవును. శూద్రులు వేదములు చదివి, అందరకును జ్ఞానబోధచేయుచు,సకలధర్మములనువివరింతురు.ధర్మములునామమాత్రములై యుండును. దుష్కృత్యములచేతకొంతయు,అధర్మవర్తనముచేతకొంతయు,రోగములచేతకొంతయు ఆయుర్దాయము తగ్గి పదునారు సంవత్సరాలకే జనులు మరణింతురు. ధర్మమార్గములో నడచు బుద్ధి గలవారునూటికిఒక్కరోయిద్దరోఎప్పుడునుందురు. వారు బహుకష్టము లనుభవించుచు జీవనయాత్ర సాగించు చుందురు.

ఇట్లు కలిలో అధర్మము విస్తరించినపుడు దానిని అణచి ధర్మము స్థాపించుటకు విష్ణుమూర్తి కల్కి అవతారము ధరించును. కలియుగ, కృతయుగ సంధి సమయములో చంద్రవంశమున ప్రమితి అను మహాత్ముడు పుట్టును. ఇరువది సంవత్సరాల వయసులో అతడుభూమండలమంతయుదిరిగిసైన్యములనుసమీకరించుకొనిఆయుధవిద్యానిపుణులై, ధర్మమునందాసక్తులైన బ్రాహ్మణాది వర్ణముల వారితో గలిసి మ్లేచ్ఛులను, అధర్మప్రవర్తనులైన రాజులను, ప్రజలను సమూలముగా నాశనముచేసి, నాస్తికులను నిర్మూలించును.ఏమాత్రము జనులలో అధర్మము కనిపించినను వారిని సంహరించును.

తూర్పున,దక్షిణాన,పశ్చిమమున,ఉత్తరమున,దేశమధ్యభాగమున,పర్వత ప్రాంతములలోను, అధర్మ మార్గమున సంచరించు రాజులను (పాలకులను) ప్రజలు సంహరించును. సింహళ దేశములో గూడ అధర్మ పరులను నాశనము చేయును. పలుమారులు ధర్మవిచ్చేదకులపైదండయాత్రలుచేసివారినినిరవశేషముగాజంపివేయను.ప్రజలప్పుడు బీజమాత్రులుగా నుండెదరు. అనగా సస్యములు కోసినను, విత్తనములున్నచో మరల సస్యములను మొలకెత్తించ వచ్చును.చెఱకుతోటలను,ఒక పంట కాగానే గడలు తీసికొని తుక్కును కాల్చివేయుదురు. అయినను,భూమిలోమిగిలినమ్రోడులేచిగిర్చిమరొక పంట నిచ్చును.అట్లేబీజభూతులైన ధర్మాత్ములు మిగిలియుందురు. కృతయుగము రాగానే వారేసంతతిని గని వ్యాప్తిచేసి ధర్మ రక్షణము చేయుదురు. ఇట్లు మన్వంతరము మారువరకును సాగుచుండును.

వేద లక్షణములు

పురుషుడు ముని యగుటకు అతని వయస్సు కారణము గాదు. చిన్నతనమునుండియు సచ్ఛీలము,సద్బుద్ధి,వేదశాస్త్రవిషయములనుశ్రద్ధగా అధ్యయనము చేయు సూక్ష్మబుద్ధి ఇవి యన్నియు గలవాడు వయసులో చిన్నవాడైనను ఋషియగును. అతడు తపశ్శాలి యైనచో మంత్రద్రష్ట కాగలడు. అతడు పలికిన వాక్యము అర్థవంతమై ధర్మయుక్తమై సర్వజనామోద మగును. సాధారణ మానవులు పలికినది విశ్వసనీయము కాదు. దానికి ప్రమాణములుకావలెను.అదిఅర్థవంతమునుకాకపోవచ్చును.ఇదే ఋషి వాక్యమునకును సాధారణ మనుష్యవాక్కునకు గల భేదము. మంత్రద్రష్టల వాక్కులు అమోఘములు. వేదములలక్షణము:గురులఘుస్వరూపములైనఅక్షరాలఅమరికతో గణము లేర్పడును. వానితోఛందోబద్ధముగాఏర్పడినవిఋక్కులు. ఇట్టి ఋక్కులు గల వేదము ఋగ్వేదము. అక్షరనియమములేకఛందోబద్ధముకానివాక్యములుయజుస్సులు.అరిగలదియజుర్వేదము. హింకారము, ప్రణవము, గీతి, ప్రస్తావము (ప్రస్తారము), ప్రతిహోత్రము, ఉపద్రవనిధనము మున్నగు ఏడు నియమములతో వెలసి యుండునదిసామవేదము.వీనిలో హింకార, ప్రణవములను విడిచినచో అది "పంచవింధ్యము"అనబడును. అధర్వమంత్రములతో నేర్పడినది యధర్వణవేదము. ఋక్కులచేత హోతయు, యజస్సులచేత అధ్వరుడును, సామముల చేత ఉద్గాతయు, అధర్వణమంత్రములచేత బ్రహ్మయు యజ్ఞవిధులు నడిపింతురు.

వైశంపాయనముని,ఈయజుర్వేదమునువ్యాసమహామునిదగ్గరనేర్చుకొనివ్యాపింపజేసెను. యజ్ఞము చేయు విధానములన్నియు సమగ్రముగా చెప్పబడిన శాస్త్రము వంటిది కావున, వేదములలో యజుర్వేధము ప్రాముఖ్యమును బొందెను.

పృథు చక్రవర్తి

పూర్వము వేనుడను రాజుగలడు. అత డహంకారి. వేదధర్మములను పాటించువాడు కాదు. యజ్ఞయాగాదులు తన నుద్దేశించియే చేయుడని బ్రాహ్మణులను, మునులను నిర్బంధించెడివాడు. వాని యాగడములు భరింపలేక, మునులు అతని కడకుబోయిసన్మార్గవర్తివికమ్మనిబోధించిరి.అతడు కోపించి మీరున న్నాజ్ఞాపించువారా? యని యెదిరింపబోగా వారందరును బలవంతముగా వేనుని బట్టి పడద్రోసి, అగ్నికై అరణిని మథించినట్లు అతని యెడమ బాహువును మథించిరి. అందుండి నల్లని శరీరముతో పొట్టివా డొకడు పుట్టెను. వేనునిలో నున్న పాపమే ఈ రూపముగా బయలుపడెను. మునులు వానిని పర్వతప్రాంతములకు బొమ్మనియాదేశించిరి. తరువాత వేనుని కుడిభుజమును మథింపగా పృథుచక్రవర్తి పుట్టెను. అతనికి మునులందరును చాల వరము లిచ్చి పాలకునిగా పట్టము గట్టిరి. పృథువు, తండ్రి పాడుచేసిన వేదధర్మములను పునరుద్ధరించి ప్రజలను కాపాడెను. ప్రజలు అతనిని జూచి,మాకుజీవనమునకవసరమగువృత్తులుకల్పింపుమని అడిగిరి. అతడు ఆమోదించి, భూమిమీద నుండువారికి భూమినుండియే సర్వవృత్తులును సంపాదించవలెనని తలచి, ధనుర్బాణములు ధరించి బయలుదేరెను. అతనిని జూచి భూమి భయపడి గోరూపమున పరువెత్తెను. అతడు వెన్నంటి తరుమగా, ఆ భూదేవి, "రాజా!నన్ను జంపకుము. నన్ను జంపిప్రజలకునీవిచ్చెడిదేమున్నది?నేనుగోరూపముననున్నానుగనుకనాకొకవత్సమును ఏర్పరుపుము. అపుడు నీవు కోరిన వన్నియు క్షీరరూపమున కురిపించెదను. ఈ భూమి యంతయు గుట్టలు గోతులుగా నుండి సమత్వము లేక యున్నది. దీనిని చదును చేయుము"అనగా అతడు తన వింటి కోపున గుట్టలను గోతులను సరిసమానముగా జేసి పెద్దపెద్ద రాళ్ళను ఒకవైపున ప్రోవులుగా పెట్టెను. అవియే పర్వతపంక్తులు.

పూర్వమన్వంతరములలో భూమి మెట్టపల్లములుగా నుండి సస్యానుకూలముగా లేకుండెడిది. ఈ వైవస్వతమన్వంతరములో పృథు మహారాజు వలన సస్యానుకూలమైనది.

అట్లు భూమిని సరిచేసి చాక్షుషుడను మనువును వత్సముగా జేసి భూమిధేనువును పితుకగా, పాలరూపమున సర్వసస్యములను గురిపించినది. అవి త్రాగి ప్రజలు వ్యవసాయాది వృత్తులు చేసికొనుచు సుఖజీవనము గడిపిరి.

మునులు సోముని వత్సగా జేసి వేదపాత్రలలో పితుకగా బ్రహ్మము, తపస్సులు లభించినవి. దేవత లింద్రుని వత్సగా జేసి పితుకగా మధువు (అమృతము) కలిగెను.పితృదేవతలువైవస్వతునిదోగ్ధ (పితుకువాడు)గా జేసి పితుకగాస్వధ జనించెను. దానవులు దితినందనుని వత్సగా జేసి పితుకగా సర్వమాయలు జనించెను. సర్పములు తక్షకుని వత్సగా జేసి, వాసుకిని దోగ్ధగా జేసి పితుకగా విషము పుట్టెను. సర్పములకు అదే ఆహార మయ్యెను. రాక్షసులు సుమాలిని వత్సముగా జేసి పితుకగా క్షీరము లంతర్ధానమై రక్తము పుట్టెను. పర్వతము లన్నియు హిమవంతుని వత్సముగా జేసి పితుకగా ఓషధులును రత్నములును పుట్టెను. ఇట్లు ఆ సమయమున భూమినుండి యెవరికి గావలసిన వస్తువులను వారు సంపాదించుకొనిరి.

వాలి - రావణుడు

ఋక్షుడను వానరుడు బలవంతుడు. అతనికి విరజుడను వానరుడు, తన కూతురు విరజ నిచ్చి పెండ్లిచేసెను. విరజను జూచి యింద్రుడు మోహించి ఆమెకు తెలుపగా ఆమెయు నంగీకరించెను. వారికి మహాబలశాలి యైన వాలి జన్మించెను. ఆ తరువాత సూర్యుడు విరజను కామించగా ఆమె సూర్యునిపై మనసు పడెను. వారిరువురికిని మహాతేజశ్శాలి యైన సుగ్రీవుడు పుట్టెను. ఋక్షుడు తనకు, ఇంద్రసూర్యుల ప్రసాదము వలనకలిగినవాలి, సుగ్రీవులను పెంచి పెద్దలను చేసి, పెద్దవాడైన వాలికిరాజ్యాభిషేకము చేసెను.అతడుసుగ్రీవునితోడ్పాటుతోకిష్కింధను రాజధానిగాజేసికొని సకల వానరులను పాలించుచుండెను.వాలి, సుషేణుని పుత్రిక తారను, సుగ్రీవుడు పనసుని పుత్రిక రుమను పెండ్లాడిరి.కేసరియనువానరుడుఒకడుండెను.అతనిభార్యఅంజన.ఆమెనువాయుదేవుడు చిన్నప్పటినుండియు ప్రేమించెను. అంజనాదేవి వాయుదేవుని అనుగ్రహముతో ఒక కుమారుని గనెను. అతడే అంజనేయుడు. అతడు సుగ్రీవునకు మంత్రి యయ్యెను.

ఒకనాడు వాలి ప్రాతఃకాలముననే సూర్యునికి అర్ఘ్య మిచ్చుటకు దక్షిణసముద్రమునకు వెళ్ళెను. ఆ సమయమున రాక్షసరాజైన రావణుడు వాలిమీదకు యుద్ధము చేయ వచ్చెను. కావలివాడు, వాలి దక్షిణసముద్రమున కేగె నని చెప్పగా రావణుడు అచ్చటికి బోయి వాలిని వెనుకనుండి తాకుటకు ప్రయత్నించెను.

వాలి యది గమనించి తన చేతులతో వానిని బట్టుకొని చంకలో నిరికించుకొని తక్కిన సముద్రములలో గూడ స్నానమాడి కిష్కింధకు తిరిగివచ్చి మూటను బడవేసినట్లు రావణుని పడవేసెను. రావణుడు తెలివిలేకపడియుండెను.నీళ్ళుచల్లివానినిలేవనెత్తి వాలి యిట్లనెను. "దిక్పాలకులను గెలిచి త్రిలోకములను శాసించినవాడవు. ఇదేమి? ఒక వానరబాలకుని ముందు ఇంత బలహీనుడ వైతి వేమి?"రావణుడు, వాలి పాదములపై బడి నీ వింతవాడవని, తెలియక నీపై యుద్ధమునకు వచ్చి తప్పు చేసినాను క్షమింపుము. నీతో స్నేహముగా నుండు వరమునుదయచేయుము"అని ప్రార్థించెను. వాలి యాతనిని లేవనెత్తి,"మన మిప్పటినుండి మిత్రులము. మాయింట ఆతిథ్యము గొని వెళ్ళుము"అనగా రావణుడు సంతోషించి రెండు మూడు రోజులు వాలితో వినోదముగా కాలక్షేపము చేసి సెలవు తీసికొని లంకకు బోయెను. వాలి రావణులు మిత్రులు కనుకనే రాముడు, ముందు వాలిని జంపి తరువాత రావణుని మీద దండెత్తెను. లేనిచో వాలి రావణునికి సహాయముగా వచ్చును. అపుడు రావణుని గెలుచుట కష్ట మగును. ఇదే రాజనీతి.

పరశురాముడు

పరశురాముడు జమదగ్నికి, రేణుకాదేవికిని పుట్టిన కొడుకు. అతడు తల్లిదండ్రులను సేవించుకొనుచు ఉండి, తాతయైన ఋచీకుని జూచి వచ్చెదనని చెప్పి అచటికి వెళ్ళెను. ఋచీకుడు మనుమని జూచి సంతోషించెను. రాముడు నాయనమ్మను గూడపలుకరించివారికోరికమీదకొన్నిదినములుఅచటనుండిముత్తాతయైనభృగుమహర్షిని చూచుటకైఆయనయాశ్రమమునకుబోయెను.భృగుమహర్షియు, ఆయనభార్యయుముని మనుమని రాకకు సంతోషించిరి. ఒకనాడు భృగుమహర్షి రాముని బిలిచి, "వత్సా!నేను చెప్పెడిమాటలనుశ్రద్ధగాఆలకింపుము. నీ విట్టుకాలక్షేపము చేయుట సరిగాదు.ఈశ్వరుని గురించిఘోరతపముచేసిఆతనినిమెప్పించిఅతనిఅనుగ్రహమువలనసకలశస్త్రాస్త్రములు సంపాదింపుము.ఇదినీకుశ్రేయస్కరమైనమార్గము"అనిబోధింపగారాముడాతనికినమస్కరించి హిమాలయములకుబోయిపరమతపోనిష్ఠాగరిష్ఠుడైకైలాసవాసునితన హృదయపద్మమునలిపి అఖండమైన తపముచేసెను.ఆతపస్సునకు శంకరుడు సంతుష్టుడై రామునిపరీక్షింపగోరి ఒక కిరాతవేషమున వచ్చెను. తాను వధించి తెచ్చిన మృగమాంసమును రాముని దగ్గర దింపి, అతనితో, "మునీంద్రా!నీ వెవ్వడవు?ఎక్కడినుండి వచ్చినావు?ఇది నేను పరిపాలించెడి భూమి", అని పలుకగా రాముడిట్లనెను.

"నీవెవ్వడవు?తపస్సుచేసికొను మావంటి వాని దగ్గరకు ఇటువంటి మాంసఖండములతో రావచ్చునా?నీవిచ్చటినుండివెనువెంటనేపొమ్ము.నీవున్నచోటుగూడపాపముగలిగించును. "అహింసా పరమోధర్మః"అని శాస్త్రములు చెప్పచుండగా నీవు ఈ హింసను నిత్యము చేయుచున్నావు. నీతో మాటలాడుట కూడ పాపమే". కిరాతకు డామాటలు విని, "నన్ను అకారణముగా దూషించుచున్నావు. నేను కిరాతుడను నా వారిని పోషించుకొనుటకై నే నీ మాంసమును సంపాదించినాను. అవసరమైన దానికన్న ఎక్కువ జంతువులను జంపినచో హింస యగును. ఈ మాంసభక్షణము మాకు బ్రహ్మ విధించిన యాహారము. దీనినే తప్పుగా భావించినచో నిన్నేమనవలెను?తండ్రి ఆదేశించినాడని, ముందు వెనుకలుచూడకతల్లినేచంపినావు.నీవుపాపాత్ముడవా?లేకబ్రతుకుటకైమాంసాహారమును సంపాదించుకొనునేనుపాపాత్ముడనా?ఎవరున్నచోటుపాపభూయిష్టముగానుండునోయిప్పుడు చెప్పుము.నేనున్నచోటుననుండుటకునీకిష్టము లేనిచో, నిన్ను ఎరుగనివా రుండు చోటికి పొమ్ము. తెలిసిన వారున్నచో నిన్ను మాతృహంతకుడవని తిట్టుదురు"అని పలుకగా, అతని మాటల తీరును బట్టి నిజముగా కిరాతకుడు కాడని యనుమానించి, రాముడు చేతులు ముకుళించి యిట్లనెను. "అయ్యా, నీ వెవ్వడవో కాని నీ మాటలు కేవలకిరాతుని మాటలవలె లేవు. సాధారణ కిరాతకులకు ఇటువంటి తేజస్సు ఉండదు.నీవుదిక్పాలురలో ఒక్కడవో బ్రహ్మవో, విష్ణుమూర్తివో, లేక నే నుపాసించుచున్న త్రినేత్రుడవో చెప్పుము. నన్నునుగ్రహించుటకు పరమేశ్వరుడే యీ రూపమున వచ్చినట్లు నాకుదోచుచున్నది. ఓశంకరా!భక్తవశంకరా!నాయజ్ఞానమునుమన్నించినాకుప్రసన్నుడవుగమ్ము.నామాటలను పట్టించుకొనక నన్ను క్షమింపుము. నీవు భక్తవరదుడవు. పాహిమాం, పాహిమాం "అనుచు సాష్టాంగదండ ప్రణామములు చేసెను. పరమశివుడు చిరునవ్వు నవ్వి "పుత్రా! నీ తపమునకు మెచ్చితిని. నీవు కోరినట్లు శస్త్రాస్త్రము లీయగలను, కాని వానిని భరించుటకు నీ శక్తి చాలదు. తీర్థయాత్రలుచేసి ఆయా క్షేత్రములందు వెలసిన దేవతలను ఉపాసించి, వచ్చి మరల తీవ్రమైన తపము చేయుము. అపుడా శస్త్రాస్త్రములను ధరించెడి, భరించెడి శక్తి నీకు వచ్చును."అని చెప్పి అదృశ్యు డయ్యెను. రాముడు తీర్థయాత్రలకు బయలుదేరి సమస్త తీర్థములలో స్నానమాడి, అక్కడ నున్న దేవతల నారాధించి మరల హిమాలయములలో పూర్వము తపము చేసిన చోటికి వచ్చి పరమ నిష్ఠతో తపము చేయుచుండెను.

ఇది ఇట్లుండగా రక్కసి మూకలు పెచ్చుపెరిగి భూలోకమందు యజ్ఞాదులు ధ్వంసముచేయుచు, ప్రజలను బాధించుచు, అంతటితో బోక దేవేంద్రుని రాజధానియగు అమరావతిమీద దండెత్తి పోయి దేవతలతో పోరాడి వారిని ఓడించి స్వర్గమునుండి తరిమివేయగా వారు శివునియొద్దకు పరుగెత్తి మొర పెట్టుకొనిరి.పరమేశ్వరుడు వారిని అనునయించి,ప్రమథగణములలోనిమహోదరుడనువానిని బిలిచి, "హిమాలయములలో పరశురాముడు తపము చేసికొనుచున్నాడు. వానిని వెంటనే పిలిచికొనిరమ్ము. అతడు తన పరాక్రమముతో రాక్షసులను గెలువగలడు. అతనిని నేను పిలుచుచున్నానని చెప్పి తీసికొనిరమ్ము"అని పంపెను. అతడు వచ్చి పరశురామునికి పరమశివుని ఆజ్ఞను తెలియజేసి రమ్మని పిలిచెను. పరశురాముడు శంకరుని యాజ్ఞను తలదాల్చి వెంటనే అతనితో బయలుదేరి శంకరుని సమక్షమున నిలిచెను. శివుడాతనితో "రామా!నీవు వెళ్ళి స్వర్గము నాక్రమించుకొన్నఆ దుష్టరాక్షసులను సంహరించి దేవేంద్రుని యథాస్థానమున ప్రతిష్ఠించి రమ్ము. అందుకు సమర్థుడవు నీవే"అని పలుకగా, రాముడు "ఓ మహాదేవా! నేను సామాన్యుడనైన విలుకాడను. అస్త్రశస్త్రము లేవియు నేర్వనివాడను. దేవతలకే అసాధ్యులయిన ఆ రాక్షసులను ఎట్లు గెలువగలను"?అని యడుగగా నీలగ్రీవుడు "నాయనా!నీకు సహజసిద్ధమైన పరాక్రమ మున్నది. దానికి తోడు అమోఘమైన తపశ్శక్తి కూడ ఉన్నది. ఇంక నీకు ఎదురేమున్నది?అయినను నీకు నేను పరశువును (గండ్రగొడ్డలిని) ఆయుధముగా నిచ్చుచున్నాను. ఇది నా యనుగ్రహముగా భావించి రాక్షసులపై యుద్ధమునకు నడువుము. ఇకనుండి యుద్ధములలో నిన్ను గెలుచువారు లేకుండునట్లు వర మిచ్చుచున్నాను. వెళ్ళి విజయలక్ష్మితో తిరిగిరమ్ము"అని పంపెను. అప్పటినుండి భార్గవరాముడు పరశురాము డయ్యెను. అతడు రాక్షసులను యుద్ధమున కాహ్వానించెను. వారీ బడుగు బ్రాహ్మణుని జూచి నవ్వుకొనిరి. ఇత డెంత?ఇతని పరాక్రమ మెంత?అని మొదట అలవోకగా యుద్ధ మారంభించిరి. పరశురాముడు వారిని సంహరించి తక్కిన వారినిగూడ వెదకి వెదకి దొరికినవారిని దొరికినట్లు తన గండ్రగొడ్డలి కెరగా చేసెను. రాక్షసులు, ఈతడు తమ పాలిటి కాలయముడని భావించి, భయపడి పారిపోవజొచ్చిరి.రాముడువారినితరిమితరిమిచావగొట్టెను.స్వర్గమున రాక్షసు డన్నవాడు మిగులలేదు.

ఇంద్రుని బిలిచి నీ రాజ్యమును నీ వేలుకొనుమని, అతనిని స్వర్గసింహాసనముమీద కూర్చుండబెట్టి, తాను మరల హిమాలయములకుబోయి త్రినేత్రుని గూర్చి ఘోరతపము చేయుట మొదలుపెట్టెను. ఇట్లు కొంతకాలము గడచెను. పరమేశ్వరు డాతని తపస్సునకు మెచ్చి, "ఏమి వరములు కావలెనో కోరుకొను"మనగా రాముడు ఆదేవాదిదేవుని పరమభక్తితో స్తుతించి "భక్తచింతామణీ!ఓ పినాకపాణీ!నాకు సమస్తశస్త్రాస్త్రములను ప్రయోగోపసంహారములతో సహా అనుగ్రహింపు"మని ప్రార్థించెను. ఆ త్రిపురాంతకుడు పరశురామునికి వాయువేగముగల గుఱ్ఱములతోడి రథమును, అక్షయతూణీరములును, శత్రువులకు భేధింపశక్యముగాని కవచమును, దివ్యమై దృఢమైన నారి గల మహాధనుస్సును, బాణములును ప్రసాదించెను. అతని పేరుమీద విఖ్యాతి నందిన భార్గవాస్త్రమును గూడ ఇచ్చెను. సకలాస్త్రములను ప్రయోగోపసంహార పూర్వకముగా నొసంగెను. తనయందు ఎన్నడును చలించని భక్తిని గూడ ప్రసాదించి యదృశ్యు డయ్యెను. పరశురాముడు, ఈశ్వరుని సమక్షముననే మహోదరుని జూచి, "ఓ సహోదరా!ఈశ్వరుడు నా కనుగ్రహించిన యీ ధనుస్సును, రథమును నాకొఱకు దాచిపెట్టుము. పని కలిగినపుడు నేను నిన్ను మనసులో తలచుకొందును. అప్పుడు తెచ్చి వీనిని నా కందిమ్ము"అని ప్రార్థించెను. అత డట్లే యని వానిని దాచిపెట్టుటకు అంగీకరించెను. అక్కడినుండి రాముడు ప్రయాణించి, ముత్తాత భృగుమహర్షినిజూచి,తనతపమును,తత్ఫలితముగాలభించినరథాయుధశస్త్రాస్త్రములను గూర్చి విన్నవించి పాదాభివందనము చేసి బయలుదేరి, ఋచీకుని (పితామహుడు) దగ్గరకు వచ్చి, ఆయనకు గూడ తన తపస్సును, పార్వతీపతి యనుగ్రహమును అన్నియు దెలిపి నమస్కరించి తన తల్లిదండ్రుల దగ్గరకు జేరెను. వారతనిని జూచి పరమానందము నొందిరి. ఇట్లుండ ఒకనాడు మాహిష్మతీపురాధీశుడు కార్తవీర్యార్జునుడు వేటకై అడవికి వచ్చెను. జమదగ్ని ఆశ్రమమునకు రాగా ఆయన, కామధేనువును ప్రార్థించి, రాజునకును పరివారమునకును మృష్టాన్నములతో విందుచేసెను. సమస్త సౌకర్యములును కలుగజేసెను. రాజు మరునాడు ఉదయమున మునియొద్ద సెలవు తీసికొని తన నగరమునకు బోయెను. అతని మంత్రి చంద్రగుప్తుడనువాడు రాజునొద్దకు వచ్చి కామధేనువు ప్రసక్తి తెచ్చి, "అది యున్నచో అన్నియు నున్నట్లే.దానిని సంపాదింపు"మని బోధించెను.

రాజు ఆ మంత్రినే సామదాన భేదోపాయములచే దానిని తెమ్మని పంపెను. జమదగ్ని కామధేనువు నిచ్చుటకు నిరాకరించగా ఆ మంత్రియు, భటులును గలిసి జమదగ్నిని జంపి ఆ ధేనువును దూడను గూడ అపహరించిరి. ఆ సమయమునకు రాముడు ఇంట లేడు. అతడు వచ్చుసరికి తల్లి, తండ్రి శరీరముమీద పడి యేడ్చుచుండెను. పరశురాముడు చూచుచుండగా ఆమె యిరువది యొక్కసారులు గుండెలు బాదుకొని యేడ్చెను. అది చూచి రాముడు దుష్టరాజవంశములను ఇరువదియొక్క సార్లు దండయాత్రలుచేసి సంహరించెదనని ప్రతిజ్ఞ చేసెను. తల్లియైన రేణుక సహగమనము చేసెదనని కొడుకులతో జెప్పి అందుకు సంసిద్ధురా లయ్యెను. ఇంతలో ఆకాశవాణి "సహగమనము చేయవలదు. వేచి యుండుము. శుభములు గలుగు"నని చెప్పెను. భృగు మహర్షి అక్కడికి వచ్చి పరిస్థితిని జూచి తన మృతసంజీవనీ మంత్రశక్తిచేత జమదగ్నిని తిరిగి బ్రతికించి, అందరిని దీవించి వెడలిపోయెను. రాముడు, తిరిగి బ్రతికిన తండ్రిని జూచి నమస్కరించి, తన ప్రతిజ్ఞను తెలియజేసెను. ఆయన, "అపకారియైనను ఉపకారము చేయుట బ్రాహ్మణ ధర్మమని, తిరిగి కీడు చేయుట సరిగా"దని బోధించెను. రాముడు తండ్రిని ఒప్పించ జూచెను. ఆయన "రామా!నీవు బ్రహ్మదగ్గరకు బోయి విషయమును వివరించి, ఆయన చెప్పినట్లు చేయు"మని పంపెను. రాముడు బ్రహ్మ దగ్గరకుబోయి,"మహాత్మా!నేను ఏకవింశతి పర్యాయములు దండెత్తి క్షత్రియసంహారము చేయుదునని ప్రతిజ్ఞ చేసితిని. అది నెరవేరునట్లు దీవింపుము"అనగా బ్రహ్మ, "నాయనా! నేను చాల కష్టపడి సృష్టి చేసితిని. నీవు దానిని సంహరించుటకు పూనినావు. ఇంక నే నేమి చెప్పగలను?కైలాసమునకు వెళ్ళి పరమేశ్వరుని ప్రార్థింపుము.ఆయన నీకు తగిన ఉపదేశము చేయగలడు"అని పంపివేసెను. రాముడు తిన్నగా కైలాసమునకేగి, పార్వతీసమేతుడైన యాతనిని స్తుతించి, తన ప్రతిజ్ఞ విషయమును జెప్పి ఆ ప్రతిజ్ఞ నెఱవేరు ఉపాయము సెల వి"మ్మని ప్రార్థించెను. శివుడు "నాయనా!నీవు నా కుమారుడైన కుమారస్వామితో సమానుడవు. నీ కోరిక నెరవేరునులెమ్ము. దేవతలకు గూడ పొంద శక్యముగాని త్రైలోక్యవిజయ కవచమును, నారాయణాగ్నేయాది దివ్యాస్త్రములను,గదాదిసర్వాయుధములనునీకిచ్చెదను.సిద్ధసంకల్పుడవు కమ్ము"అని చెప్పి,దివ్యాస్త్రములను, ఆయుధములను ఇచ్చెను. తరువాత, "ఓం గోపీజనవల్లభాయ స్వాహా" అను విజయసిద్ధి మంత్రము నుపదేశించెను.

దానికి సదాశివుడు ఋషి. పంక్తిచ్ఛందము . రాస(గాన) రతుడు మాధవుడు దేవత. అఖిల కార్యదిగ్విజయమునందు వినియోగము అని దాని నియమములును చెప్పి, శ్రీకృష్ణ కవచము (అదే త్రైలోక్యవిజయ కవచము) నుపదేశించెను. రాముడు పార్వతీ పరమేశ్వరులకు దండప్రణామములు చేసి పుష్కరతీర్థమునకు బోయి పదిలక్షల సార్లు మంత్ర, కవచ జపంబులుచేసి మంత్రసిద్ధిని పొందుటకై ప్రయత్నించెను. ఒకనాడు ఒక నదికి, దాహము తీర్చుకొనుటకై వెళ్ళెను. అచటికి లేళ్ళ జంట యొకటి వచ్చెను.

మగలేడి నీరు ద్రావి, తన భార్యతో నిట్లనెను. "ఇదిగో, ఈ గట్టుమీద కూర్చుండిన యితడు భార్గవరాముడు. శివుని యొద్ద మంత్రకవచములు నేర్చుకొని జపము చేసినాడు కాని సిద్ధి కలుగలేదు. అగస్త్యునియొద్ద శ్రీకృష్ణ ప్రేమామృతస్తోత్రమును ఉపదేశము పొంది దానిని పునశ్చరణము చేసినపుడే సిద్ధి కలుగను"ఆడ లేడి "నీకీ త్రికాలజ్ఞాన మెట్లు కలిగె"నని యడుగగా మగలేడి, "నేను పూర్వజన్మములో విప్రబాలకుడను.

వేదవేదాంగములను జదివినాడను. ఒక పులి లేడిని జంపుచుండగా చూచి దానినే చింతించుచు కొండమీది నుండి పడి మరణించితిని. అందుచేత నాకీ మృగజన్మము వచ్చెను. ఈ మహాతపశ్శాలియైన పరశురాముని జూడగానే నీకీ జ్ఞానము కలిగినది. ఈయనమహానుభావుడు"అనిచెప్పుచుండగాపరశురాముడామృగీమృగసంవాదము విని అగస్త్యాశ్రమమునకు బయలుదేరెను. ఈ లేళ్ళజంట గూడ రాముని వెంట వెళ్ళెను. రాముడు అగస్త్యాశ్రమమునకు వెళ్ళి ఆయనకు నమస్కరించి తనకు ఆ మంత్రము నుపదేశింపుమని యడిగెను. అగస్త్యుడా మంత్రము నతనికి ఉపదేశించెను. దీనిని సువర్ణముఖీ నదీతీరమున గూర్చుండి పునశ్చరణముచేయు మనెను. రామునకు అగస్త్యుడు ఉపదేశించిన మంత్రమును విని లేళ్ళజంట తరించి స్వర్గమునకు బోయెను. రాముడు, సువర్ణముఖీ తీరమున కేగి అచ్చట నియమనిష్ఠలతో జపము చేయగా శ్రీకృష్ణుడు ప్రత్యక్ష మయ్యెను. రాము డాతనిని స్తుతించెను. శ్రీకృష్ణు డిట్లనెను : "కార్తవీర్యుడు చంద్రుని అంశములో బుట్టినవాడు. అంతేకాదు. దత్తాత్రేయమహామునిని భక్తితో సేవించి వేయి చేతులు సంపాదించుకొన్నవాడు. అతనిని సామాన్యులు జయించలేరు. కనుక నా అంశమును నీయందు నిక్షిప్తము చేయుచున్నాను. దీనితో మహాశక్తి సంపన్నుడవై కార్తవీర్యార్జునుని జయింపగలవు. రాబోవు ఇరువదినాలుగవ మహాయుగమున త్రేతాయుగములో దశరథరాముడుగా నేను జన్మింతును. అప్పుడు నా తేజస్సును నీనుండి మరల తీసికొందును"అని వరమిచ్చి యదృశ్యుడయ్యెను.

రాముడు, అకృతవ్రణుడను తన అనుచరుని బిలిచి, "నేను యుద్ధమునకు వచ్చుచున్నా"నని అర్జునునకు చెప్పి రమ్మనెను. వాడు చెప్పి వచ్చెను. అర్జునుడు యుద్ధసన్నాహములు చేసెను. పరశురాముడు మహోదరుని స్మరించెను. అతడు రథమును, ఆయుధములను దెచ్చి యిచ్చెను. దానిపై నెక్కి రాముడు దండయాత్రకు వెడలెను. దివ్యాస్త్రములచే సైన్యములను చెల్లాచెదరుచేసి, నాశన మొందించెను. అర్జునుని సామంతులను కడతేర్చెను. అర్జునడు తనకు దత్తాత్రేయుడు ఇచ్చిన వరముతో గర్వించి, దుశ్శకునములను లెక్కచేయక రణరంగమునకు వచ్చెను. పరశురాము నొక గడ్డిపోచగా భావించెను. కాని యతనితో యుద్ధముచేయుట చాల కష్ట మయ్యెను. రాముడు అతని రథమును కూల్చి, గుఱ్ఱాలనుజంపి వేసెను. భూమిమీద నిలిచిన యర్జునుని తన పరశువుతో కంఠము నరికి చంపివేసెను. అతని యభిమానులైన రాజులుకొందరుతనపైకి రాగా వారినిగూడ శస్త్రాస్త్రములు ప్రయోగించి సంహరించెను.

ఇట్లు అర్జునుని సంహరించిన తరువాత, ఈ విషయమును గురువగు పరమశివునకు జెప్పి ఆశీస్సులు పందవలెననిపరశురాముడు కైలాసమునకు బోయెను. ఆ సమయమున పార్వతీపరమేశ్వరులు ఏకాంతములో నుండిరి. లోనికి వెళ్ళబోయిన రాముని గణపతి నిలుచుండబెట్టి, "సోదరా!ఉమాశంకరులు ఏకాంతమున నున్నారు. ఇపుడు వారి యొద్దకు బోయి వారి యానందమును చెరుపరాదు. అది నరకమునకు కారణ మగును. సతీపతుల యేకాంతమునకు విఘ్నము కలిగించిన వాడు ఏడు జన్మములలోభార్యావియోగమునమభవించును.కావునకొంచెము సేపు ఆగుము"అనగా, రాముడు, "ఏమేమీ!వింతగా మాటలాడుచున్నావే!వారి బిడ్డలమైన మనకు కూడ నిషేధములున్నవా?నేనుసమయోచితముగానేమెలగెదను.నన్నులోనికిబోనిమ్ము"అనెను. గణపతి వీలులేదనెను. వారిద్దరికిని పెద్ద వాగ్యుద్ధము జరిగెను, కుమారస్వామి సర్ది చెప్పబోయెను. అతనిమాటల నెవ్వరును వినలేదు. బాహాబాహిగా (మల్లయుద్ధము) రణము సాగెను. గణపతి పరశురాముని చేతులతో పైకెత్తి భూర్భువస్స్వర్లోకాదులైన ఊర్ధ్వలోకములన్నిటినిచూపించి,మహాసముద్రములోముంచివేయుటకుఆలోచించుచుండగా రాముడు మహాభయార్తు డయ్యెను. భయపడిన రాముని కరుణించి విడిచిపెట్టి, గణపతి నిర్వికారముగా నిలుచుండెను. రాముడు తనకు జరిగిన అవమానమునకు మండిపడి తన చేతిలో నున్న ఈశ్వరదత్తమైన పరశువును గణపతిపై ప్రయోగించెను. గణపతి, తన తండ్రి యిచ్చిన అమోఘమైన ఆ పరశువును గౌరవించెను.

ఎదిరించలేదు. అందుచే ఆ పరశువు అతని ఎడమవైపు దంతమును ఖండించెను. అక్కడ నున్న కుమారస్వామి మున్నగువారు నిశ్చేష్టులై నిలబడిరి. వారిలో గొందరు పరశురామునిపై బడబోయిరి. ఆ కలకలము విని పార్వతీపరమేశ్వరులు లోపలినుండి వచ్చిరి. పార్వతి భగ్నదంతుడైన గణపతిని, పరశురాముని జూచి ఈశ్వరునితో ఇట్లనెను. "చూచుచున్నారు గదా. మీరు ఇతనిని శిష్యునిగా జేసికొని అడిగిన వరము లన్నియు ఇచ్చి,మీ కుమారులతోసమానముగాజూచుకొన్నందుకు గొప్ప గురుదక్షిణ యిచ్చినాడు. మీ రసలు నన్నును నా కొడుకును పట్టించుకొనరు. మీకు ఇతరులే మా కంటె ఎక్కువ. ఇంత జరిగిన తరువాత ఇక్కడ నే నుండను. నా పిల్లలతో గలసి మా పుట్టింటికి బోయెదను". శివునకు ఏమి చేయుటకును తోచలేదు. గోలోకనివాసియైన శ్రీ కృష్ణుని ధ్యానించెను. అతడు రాధాసహితుడై ప్రత్యక్ష మయ్యెను. పార్వతీపరమేశ్వరులు వారిని సమ్మానించి పీఠములపై కూర్చుండబెట్టి మర్యాదలు చేసిరి. కృష్ణుడు పార్వతీదేవితో ఇట్లనెను. "అమ్మా!నీవు జగన్మాతవు. నీ బిడ్డలపై కోప మెందుకు?ప్రశాంతచిత్తవైనీ కుమారునివంటివాడైనయీ పరశురాముని శిరస్సుపైచేతినుంచి, ఒడిలో గూర్చుండ బెట్టుకొనుము. తప్పుచేసినమాట నిజమే!కాని నీ పాదములపై బడిన వీనిని, నా మాటవిని యాదరింపుము"

నీ కొడుకు గణపతి, వేదశాస్త్ర పురాములందు ప్రశంసింపబడును. ప్రమథగణములకు పతిగావున గణపతియనియు, బ్రహ్మాండము లన్నియు కడుపులోనుండుటచేతలంబోదరుడనియు,గజశిరస్సుగలవాడగుటచే గజాననుడనియు, శపించబడిన చంద్రుని శిరమున ధరించుటచే ఫాలచంద్రుడనియు, విఘ్నములు తొలగించుటచే విఘ్ననాశకుడనియు చెప్పబడుచున్నాడు. ఇప్పుడు పరశురామునిచే దంతము భగ్న మైనది కనుక ఇకనుండి గణపతి, ఏకదంతుడని కూడ కీర్తింపబడును. భవిష్యత్కాలములో బ్రహ్మకు వక్త్రము (ముఖము) కాగలడు. అందుచే వక్త్రతుండుడు అని పేరు గాంచును. ఏ శుభకార్యములుగాని, ఏ పనిని గాని ప్రారంభించుటకు ముందు ఈ విఘ్ననాయకుని సర్వలోకవాసులును పూజింతురు."

రాధ, పార్వతిని జూచి, "భవానీ!ఈ శివకేశవు లిరువురును రూపభేదముతో మనకు గనిపించుచున్నను నిజమునకు వారి మధ్య భేద మేమియు లేదు. "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే, శివస్యహృదంవిష్ణుః విష్ణోశ్చ హృదయం శివః"అని స్మృతులును, "నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి"

అనిశ్రుతులును వారి ఏకత్వమును బోధించుచున్నవి. అంతేకాదు, నేను శివస్వరూపిణిని. నీవు విష్ణుస్వరూపిణివి. "కృష్ణస్తు శ్యామలాదేవీ రామస్తు లలితా స్వయమ్, కైలాసవాసీ రుద్రస్తు రాధా స్వయమసంశయః"అను పురాణ వచనములను బట్టి మనలో భేదము లేదు. కావున శ్రీకృష్ణుని మాటల నాదరించి పరశురాముని రక్షింపుము"అని పలికెను. పార్వతి తనకు మ్రొక్కి స్తుతించి పరశురాముని శిరమున చేయిపెట్టి ఆశీర్వదించెను. రాధాకృష్ణులు, గణపతిని కుమారస్వామిని బుజ్జగించి దీవించిరి.

పరశురాముడు రాజులను వధించుట

కార్తవీర్యార్జునునకు నూరుగురు కొడుకులు. అందరును బలపరాక్రమ సంపన్నులే కాని ఆనాడు పరశురాముని చేతిలో ఓడిపోయిరి. ఆ రాముడు తమ తండ్రిని జంపినా డన్న కోపముతో అవకాశమునకై ఎదురు చూచుచుండిరి. రాముడు పండ్రెండేళ్ళపాటు తపము జేసికొనుటకు ఆశ్రమము విడిచి వెళ్ళెను.ఆ సమయమును గనిపెట్టి కార్తవీర్యుని పుత్రులు వచ్చి జమదగ్నిని జంపివేసిరి. ఆశ్రమమునందున్న మునులు పరశురాముని తమ్ముల నోదార్చి దహనాద్రికియలను జరిపించిరి. రేణుక సహగమనము చేసెను. తపము చాలించి రాము డాశ్రమునకు వచ్చెను. జరిగిన ఘోరమును ఆశ్రమవాసులు రామునకు వివరించిరి. వెంటనే పరశురాముడు ఆయుధములు తీసికొని అకృతవ్రణుడు వెంట రాగా మాహిష్మతీనగరమునకు బోయి కార్తవీర్యుని కొడుకుల నందరను, వారికి సహాయముగా వచ్చిన రాజులను జంపివేసెను. తరువాత ఇరువది సార్లు రాజులపై దండెత్తి వారిని సమూలముగా నాశనము చేసి, కురుక్షేత్రమున శ్యమంతపంచక మను చెరువులు ద్రవ్వించి అందు స్నానమాడి తన పితరులకు తర్పణములు చేసెను. రాజుల వధవలన కలిగిన పాపమును పోగొట్టుకొనుటకై కశ్యపుని బ్రహ్మగా జేసికొని అశ్వమేధయాగము చేసెను. యాగానంతరము ఋత్విక్కులకు భూరి దక్షిణ లిచ్చెను. తాను నివసించుటకు మహేంద్రపర్వతము నెన్నుకొని, అది తప్ప తక్కిన భూమి నంతను కశ్యపునకు బ్రహ్మదక్షిణగా దానము చేసెను. అది మొదలు భూమి కాశ్యపి అనబడెను. ఆ తరువాత పరశురాముడు పితృదేవతల కోరికపై శాంతించి మహేంద్రపర్వతమునకు బోయి తపము చేసికొనుచుండెను.

సగర చరిత్రము

ఇక్ష్వాకువంశమున సగరుడను నతడు జన్మించెను. ఇతడు తల్లి గర్భములో నుండగా సవతితల్లులు విషము పెట్టిరి. అయినను తల్లిగాని, కడుపులోని శిశువుగాని చావలేదు. గరమనగా విషము. అందుచే సగరుడయ్యెను. ఇతని కిరువురుభార్యలు. పెద్దభార్య కొడుకు అసమంజసుడు. వీడు చాల దుర్మార్గుడై పిల్లలను సరయూనదిలో ముంచి చంపుచుండగా తండ్రి కోపించి రాజ్యమునుండి బహిష్కరించెను. కాని యితని కొడుకు అంశుమంతుడు చాల సద్గుణవంతుడు.

అసమంజసుడు పూర్వజన్మములో ఒక కోమటి. అతడేదియో పనిమీద అరణ్యమార్గమున బోవుచుండగా ఒక అక్షయమైన నిధి కనబడెను. దాని నాతడు తీసికొనబోయెను. దానికి కావలి యున్న ఒక పిశాచము వాని నడ్డగించి, "ఓ వైశ్యుడా! నాకు ఆకలి మిక్కుటముగా నున్నది. తిండికై యీ నిధిని విడిచి పోలేను. నాకు చాలినంత గోమాంసమును బెట్టినచో యీ ధనమును నీ కిచ్చెదను"అనగా వైశ్యుడు, "నాకు ముందు ధన మిచ్చినచో నీవు కోరిన తిండి పెట్టెద"నని మాట యిచ్చి ధనమును దీసికొని యింటికి బోయెను. వాడు పిశాచమునకు తిండి పెట్టకుండ ధనము ననుభవించెను. ఆదోషమువలనఎంతోకాలముబ్రతుకలేదు.ఆవైశ్యుడే అసమంజసుడుగా జనించెను. పిశాచము వానిపై కక్ష వహించి వాని నావేశించెను. దానితో వా డందరిని జంపి నదిలో బారవేయుచుండగా తండ్రి, దేశమునుండి బహిష్కరించెను.

రెండవ భార్య సుమతి గర్భమునుండి ఒక అలాబువు (ఆనపకాయ) పుట్టెను. దానిని ఆమె అవల బారవేయుటకు యత్నించుచుండగా ఔర్వమహాముని అక్కడకు వచ్చెను. "ఆ కాయనిండ అరువదివేల బీజము లున్నవి. వానిని జాగ్రత్తగా చూచుకొన్నచో అరవదివేలమంది పుత్రులు కలుగుదురు"రని అతడు చెప్పెను. అట్లే అరువదివేలమంది కుమారులు పుట్టిరి. వారు పెరుగుచున్న కొలది వారిలో దుర్మార్గము కూడ పెరిగిపోయెను. వారు అందరిని బాధించుచు లోకకంటకు లైరి. యజ్ఞములను ధ్వంసము చేయుచుండిరి. దానితో దేవత లీ సగర పుత్రులను పరిమార్చు ఉపాయ మేమి యని బ్రహ్మనడిగిరి. ఆయన దేవతలతో, "కపిల మహాముని పాతాళమున తపముచేయుచున్నాడు.ఆయననారాయణాంశసంభూతుడు.ఈ సగర పుత్రులనుఆయన ముందురు త్రోయుడు. కపిలుని కోపాగ్నికి వారు భస్మమగుదురు. ఆ యుపాయమును మీరుఆలోచింపుడు"అని చెప్పెను.

సగరు డశ్వమేధయాగము చేయ సంకల్పించెను. యాగాశ్వమును రక్షించుటకు సగర పుత్రులందరును దాని వెనుక బయలుదేరిరి. ఈ అవకాశమును ఇంద్రుడు ఉపయోగించుకొనెను. వాయుదేవుని సహాయముతో అశ్వమును దొంగిలించి కపిలమహాముని దగ్గర నిలిపెను. సగరపుత్రులు చూచుచుండగా గుఱ్ఱము భూమిలోనికి కూరుకొనిపోయెను. వారి దానిని తిరిగి సంపాదించుటకై భూమిని త్రవ్వివేసిరి. అప్పటికి సముద్రజలములలేవు.దేవతలురాక్షసులతోయుద్ధముచేసి వారిని సంహరించుచుండగా కొందరు రాక్షసులు సముద్రగర్భములో దాగుకొనిరి. దేవతలు అగస్త్యమహామునిని ప్రార్థించి,"సముద్రజలములనునీవుత్రాగివేసినచోరాక్షసులనుమేముసంహరింతు"మనిరి. అగస్త్యుడుఅంగీకరించి సముద్రజలమును త్రాగివేసెను. భూమి బయటపడగా దేవతలా రక్కసులను జంపివేసిరి.

ఆ నేలనే త్రవ్వుకొనుచు సగరకుమారులు పాతాళలోకము వఱకు వెళ్ళిరి. అక్కడ వెదుకగా కపిలమహర్షి ప్రక్కనే కట్టివేయబడిన యాగాశ్వము కనిపించెను. ఆ కపిలుడే తమ అశ్వమును దొంగిలించి దొంగ తపస్సు చేయుచున్నాడని తలచి వా రందరును కపిలుని తపోభంగము చేసి హింసింపబోయిరి. కపిలు డొక తీక్షణమైన చూపు చూచెను. అందుండి అగ్నిజ్వాలలు వెలువడి వారి నందఱను భస్మము చేసెను. సగరునకు ఈ విషయము తెలిసి విచారించెను. మనుమడు అంశుమంతుని బిలిచి " నీ వాయాగాశ్వమును ఇమ్మని కపిలమహర్షిని ప్రార్థించి తీసికొని రమ్ము. ఎంత విచారములో నున్నను యజ్ఞమును పరిసమాప్తి చేయక మధ్యలో విడువరాదు"అని చెప్పగా అతడు వెళ్ళి కపిలుని ప్రార్థించి అశ్వమును దెచ్చెను. సగరుని యజ్ఞము పూర్తి యయ్యెను. పుత్రశోకముతో క్రుంగిపోయిన సగరుడు మనుమనికి రాజ్య పట్టాభిషేకము చేసి తాను తపమునకై అడవులకు బోయెను.

అంశుమంతుడు కపిలుని కోపాగ్నిలోబడి భస్మ మైన పినతండ్రులకు ఉత్తమగతులు గలుగు టెట్లని పండితుల నడిగెను. "గంగను దెచ్చి వారి బూడిదలపై ప్రవహింపజేసినచో వారికి మంచి గతులు గలుగు"నని చెప్పిరి. అంశుమంతుడు తన కుమారుడు దిలీపునకు రాజ్యాభిషేకము చేసి తపము చేయుటకు హిమాలయములకు వెళ్ళెను. కాని అతని తపము సిద్ధి నొందలేదు. తరువాత దిలీపుడు గంగను స్వర్గలోకము నుండి దించుటకు యత్నించెను.కాని అతనికి కూడ సాధ్యము కాకపోయెను. ఆ తరువాత భగీరథుడు గంగను గూర్చి మహాతపము చేసెను.

ఆమె ప్రత్యక్ష మై, "నేను భూమికి దిగుచున్నపు డాధాటికి భూమి తట్టుకొనలేదు. శివుని ప్రార్థింపుము. అతడు నన్ను భరింపగలడు"అని చెప్పగా భగీరథుడు శివుని ప్రార్థించెను. అత డంగీకరింపగా గంగ అతని జటాజూటములోనికి దూకి, హిమాలయములపై బడి, చాలదూరము ప్రవహించి సగర కుమారులు త్రవ్విన మహాగర్తము (గొయ్యి)ను పూరించి పాతాళమునకు దిగి, సగరకుమారుల చితాభస్మముల మీదుగా ప్రవహించెను. దానితో సగరకుమారులు తరించిరి. వారు త్రవ్విన గోతిని పూరించుట చేత సముద్రము సాగరమని పిలువబడెను.

## గోకర్ణ క్షేత్రము

భారత దేశమునకు దక్షిణ భాగమున గోకర్ణమను పుణ్య క్షేత్ర మొకటి కలదు. అది పరమేశ్వరుడు ప్రీతితో నివసించిన ప్రదేశము. అచట చేసిన యే దానమైనను, ధర్మ మైనను, తపమైనను, జపమైనను కోటి గుణితమైన ఫలము నిచ్చును. అచట మరణించిన వారికి మోక్షము అరచేతిలోని అరటిపండు. స్నానము చేసి అక్కడ వెలసిన గోకర్ణేశ్వరునికి జపాభిషేక హోమములు చేసిన వారికి కోరిన సిద్ధులు లభించును.

అటువంటి మహాపుణ్య క్షేత్రములో మహర్షులు నివసించుచు, నిత్యమును గోకర్ణేశ్వరుని సేవించు చుందురు. ఆ పుణ్య క్షేత్రము, సముద్రము ఆకాశగంగతో నిండుటతో నీళ్ళలో మునిగిపోయెను. మహర్షులు చింతాక్రాంతులై, ఆలోచించి పరశురాముడు ఈ క్షేత్రమును వెలికి తీయగల సమర్థుడని భావించి అతని యొద్దకు బోయి, తమకు గలిగిన దురవస్థను చెప్పుకొనిరి. వెంటనే పరశురాముడు దక్షిణ సముద్ర తీరమునకు వచ్చి, సముద్రుని, గోకర్ణ క్షేత్రమును వెలువరింపుమని అనేక విధములప్రార్థించెను.సముద్రుడుసమాధాన మీయలేదు. దానికి కోపించి భార్గవరాముడు ఆగ్నేయాస్త్రమును వింట సంధించెను.అతని కోపమునకు భయపడి సముద్రుడు మానవు రూపముతో వచ్చి "ఓ భార్గవ రామా!నీ పరాక్రమమునునే నెఱుగుదును. బ్రహ్మ మునుపు నాకు "నిన్నెవ్వరును పరాక్రమము చూపి వెనుకకు గెంటివేయలేరు"అని వరము నిచ్చెను. కాని విష్ణువు నంశము గలిగిన నీ యాజ్ఞను అతిక్రమించుట నాకు సాధ్యము గాదు.కావున నీవే మేరకు నన్ను జరిగి వెనుకకు పొమ్మందువో చెప్పుము. అట్లే చేసెదను"అనగా పరశురాముడు "గోకర్ణ క్షేత్రము బయట పడునట్లు నాలుగు వందల యోజనముల దూరము వెనుకకు జరిగి యీ మునులందరును నివసించుటకు చోటిమ్ము"అని చెప్పగా సముద్రుడు అట్లే వెనుకకు జరిగెను.

గోకర్ణ క్షేత్రము నీటి నుండి బయట పడెను. మును లందరును పరశురామునివేయినోళ్ళ గొనియాడిరి.పరశురాముడుగోకర్ణేశ్వరునిభక్తితోఆరాధించితిరిగిమహేంద్ర పర్వతమునకు జేరెను.

**రాక్షస గురువు శుక్రుడు**

ఒకప్పుడు రాక్షసులలో బలవంతులైన ప్రభువులు దేవతల చేతిలో మృతినొందిరి. దేవతలకు పట్టు చిక్కెను. మిగిలిన బలహీనులైన రాక్షసులను వెదకి వెదకి చంపుచుండిరి. వీరి ఉపద్రవమును తట్టుకొనలేక రాక్షసులు శుక్రాచార్యుని శరణము గోరుటకై శుక్రు నాశ్రమమునకు వెళ్ళిరి. అతడు రాక్షసజాతి క్షేమము గోరి వారిని కాపాడుటకై అనేక మంత్రతంత్రములు సంపాదించుటకై ఈశ్వరుని గూర్చి సహస్రవర్షములు తపము చేయుటకు పోయెను. రాక్షసు లేమి చేయుటకును తోచక దిగులు పడియుండగా భృగు మహర్షి భార్య వారిని జూచి, "నేను నా పాతి వ్రత్య ప్రభావము చేత మిమ్ములను రక్షించెదను.భయపడకు"డని వారికి అభయ మిచ్చెను. బృహస్పతి చెప్పిన యాలోచనను పురస్కరించుకొని రాక్షసుల మూకలపై బడి చంపుటకు ఇంద్రుడు వచ్చెను. భృగుపత్ని ఆతనిని తన మహిమచే స్తంభింపజేసెను. దేవతలు భయపడి పరువులెత్తిరి. అప్పుడు శ్రీహరి యింద్రునితో, "నీవు నాపై భారము మోపి నడువుము. నేను, ఈమె సుముఖమునుండి నిన్ను తీసికొని పోయెద"నని, యింద్రుని అక్కడినుండి తప్పించెను. అట్లు తప్పించుచుండగా ఆమె "ఓ యింద్రా! అప్పుడేఏమైనది?నిన్నును,నీకుతోడువచ్చినయీనారాయణునిగూడకాల్చివేసెదను" అని పలుకుచుండగా శ్రీహరి "ఇంద్రా!విన్నావా?ఆమె యేమనుచున్నదో;ఈమె బారినుండి మనము తప్పించుకొనుట ఎట్లు?"అని యడిగెను. ఇంద్రుడు "మధుసూదనా!ఈమె ఆడుది యని శంకింపకుము. ఈమె దేవతలకు చాల అపకారము తలపెట్టినది. సంహరించుటే కర్తవ్యము"అని ప్రోత్సహించెను. విష్ణువు కూడ అదియే మంచిపని యని తలచి శరసంధానము చేసి, ఆ ఒక్క బాణముతో భృగుపత్ని తల యెగుర గొట్టెను. ఆమె ప్రాణములు పోయెను. అది చూచి భృగుమహర్షి "మాధవా!స్త్రీని జంపరాదని ధర్మశాస్త్రములుచెప్పిన మాటనీ వెఱుగుదువు. అన్నియును దెలిసియుండి ఇట్లు స్త్రీవధ చేసిన నీవు భూలోకములో మనుష్యుడవుగా ఏడు జన్మము లెత్తుము"అని శపించెను. ఆ తరువాత భృగుమహర్షి తన భార్య శిరస్సును మొండెమునకు అతికించి దైవధ్యానము చేసి తన తపశ్శక్తితో ఆమెను పునర్జీవితురాలిగా చేసెను.

ఇంద్రుని బిలిచి నీ రాజ్యమును నీ వేలుకొనుమని, అతనిని స్వర్గసింహాసనముమీద కూర్చుండబెట్టి, తాను మరల హిమాలయములకుబోయి త్రినేత్రుని గూర్చి ఘోరతపము చేయుట మొదలుపెట్టెను. ఇట్లు కొంతకాలము గడచెను. పరమేశ్వరు డాతని తపస్సునకు మెచ్చి, "ఏమి వరములు కావలెనో కోరుకొను"మనగా రాముడు ఆదేవాదిదేవుని పరమభక్తితో స్తుతించి "భక్తచింతామణీ!ఓ పినాకపాణీ!నాకు సమస్తశస్త్రాస్త్రములను ప్రయోగోపసంహారములతో సహా అనుగ్రహింపు"మని ప్రార్థించెను. ఆ త్రిపురాంతకుడు పరశురామునికి వాయువేగముగల గుఱ్ఱములతోడి రథమును, అక్షయతూణీరములును, శత్రువులకు భేధింపశక్యముగాని కవచమును, దివ్యమై దృఢమైన నారి గల మహాధనుస్సును, బాణములును ప్రసాదించెను. అతని పేరుమీద విఖ్యాతి నందిన భార్గవాస్త్రమును గూడ ఇచ్చెను. సకలాస్త్రములను ప్రయోగోపసంహార పూర్వకముగా నొసంగెను. తనయందు ఎన్నడును చలించని భక్తిని గూడ ప్రసాదించి యదృశ్యు డయ్యెను. పరశురాముడు, ఈశ్వరుని సమక్షముననే మహోదరుని జూచి, "ఓ సహోదరా!ఈశ్వరుడు నా కనుగ్రహించిన యీ ధనుస్సును, రథమును నాకొఱకు దాచిపెట్టుము. పని కలిగినపుడు నేను నిన్ను మనసులో తలచుకొందును. అప్పుడు తెచ్చి వీనిని నా కందిమ్ము"అని ప్రార్థించెను. అత డట్లే యని వానిని దాచిపెట్టుటకు అంగీకరించెను. అక్కడినుండి రాముడు ప్రయాణించి, ముత్తాత భృగుమహర్షినిజూచి,తనతపమును,తత్ఫలితముగాలభించినరథాయుధశస్త్రాస్త్రములను గూర్చి విన్నవించి పాదాభివందనము చేసి బయలుదేరి, ఋచీకుని (పితామహుడు) దగ్గరకు వచ్చి, ఆయనకు గూడ తన తపస్సును, పార్వతీపతి యనుగ్రహమును అన్నియు దెలిపి నమస్కరించి తన తల్లిదండ్రుల దగ్గరకు జేరెను. వారతనిని జూచి పరమానందము నొందిరి. ఇట్లుండ ఒకనాడు మాహిష్మతీపురాధీశుడు కార్తవీర్యార్జునుడు వేటకై అడవికి వచ్చెను. జమదగ్ని ఆశ్రమమునకు రాగా ఆయన, కామధేనువును ప్రార్థించి, రాజునకును పరివారమునకును మృష్టాన్నములతో విందుచేసెను. సమస్త సౌకర్యములును కలుగజేసెను. రాజు మరునాడు ఉదయమున మునియొద్ద సెలవు తీసికొని తన నగరమునకు బోయెను. అతని మంత్రి చంద్రగుప్తుడనువాడు రాజునొద్దకు వచ్చి కామధేనువు ప్రసక్తి తెచ్చి, "అది యున్నచో అన్నియు నున్నట్లే.దానిని సంపాదింపు"మని బోధించెను.

అతడు రాక్షసుల యొద్దకు వచ్చునప్పటికి అక్కడ ఇంకొక శుక్రుడు ఉన్నాడు. అతడు దానవులకు మాయమాటలు చెప్పుచుండగా వారు వెఱ్ఱివెంగళప్పల వలె వినుచుండిరి. శుక్రుడుదానవులనుజూచి"నేనేనిజమైనమీ గురుడను. ఈత డెవడో మాయలాడు"అనగా వారు, సమాన తేజముతో ప్రకాశించుచున్న యిరువురను జూచి, ఎవరెవరో గ్రహింపలేక మూఢచిత్తులైరి. విభ్రాంతి జెందిన వారిని జూచి శుక్రుడు, "ఈతడు దేవగురువైన బృహస్పతి. నా వేషములో ఇక్కడికి వచ్చి మిమ్మందఱను మోసము చేయుచున్నాడు. మీరు నిజము తెలిసికొనలేక వీనిమాటలు నమ్ముచున్నారు"అని చెప్పగా బృహస్పతి, "దానవులారా!ఇతడే నిజముగా బృహస్పతి. తాను శుక్రాచార్యుడననుచుమిమ్ములను తప్పుదారిపట్టించుచున్నాడు.వీనినినమ్మకుడు"అనగా వారందరును శుక్రుని నిరసనగా చూచి "ఇతడు మాకు పదియేండ్లనుండి గురువుగా నుండి, మాకు అన్ని విషయములు నేర్పుచున్నాడు.వీనినిబృహస్పతియన్నచోఅందరును నవ్విపోదురు. నీవే బృహస్పతివి. మాకు అపకారము చేయుటకు వచ్చినావు"అని నిందించిరి. శుక్రుడు ఆగ్రహించి "మూఢులారా!మీరు వివేకము లేకుండగ ప్రవర్తించినందులకు అనుభవింపుడు. దేవతల చేతిలో ఓడిపోయి అవమానముల నొందుడు"అని శపించి అక్కడి నుండి వెడలిపోయెను. దేవగురుడు తాను వచ్చిన పని నెఱవేరినందుకు చాల సంతోషపడి స్వర్గలోకమునకు బోయి, దేవతలను ప్రోత్సహించి, "ఇదే సమయము. రాక్షసులను నాశనము చేయుడు. వారికి శుక్రాచార్యుని రక్షణము పోయినది"అని యుద్ధమునకు పంపెను. వారు, దానవులను యుద్ధములో చిందరవందర చేసి కొందఱను మట్టుపెట్టిరి. మరికొందరు పారిపోయి, ప్రహ్లాదుని ముందు పెట్టుకొని శుక్రుని దగ్గరకు బోయి సిగ్గుతో తలలు వంచుకొని యేమియు మాటాడలేక యుండిపోయిరి. వారిని జూచి శుక్రాచార్యుడు, "మాయవేషముతో వచ్చిన బృహస్పతిని జూచి నన్నే యని భ్రమించి మోసపోయినందులకు మీకు శాస్తి జరిగినది"అని పలుకగా ప్రహ్లాదుడు ఆయనకు నమస్కరించి, "అయ్యా!మీ శిష్యులను ఇట్లు గాలికి వదిలివేయుట తమకు న్యాయము గాదు.మీరెవ్వరికినిగనబడకుండ అదృశ్యులైన సమయమున దేవగురుడు మీ వేషముతో వచ్చెను. అందుచే వీరందరును భ్రమకులోనై పోయిరి. ఇదివీరి తప్పు గాదు.
కరుణింపవలయు"నని ప్రార్థించెను. దానితో శుక్రుడు శాంతించి "మిమ్ములను దేవతల బాధలనుండి నేను రక్షించెదను.

త్వరపడి పాతాళమునకు బోవలదు. ఇపుడు దేవతలకు కాలము కలసివచ్చినది. రేపు మీకునుకలసివచ్చును.వేచియుండుడు.మీమనుమడుబలిచక్రవర్తిసావర్ణిమన్వంతరములో రాజ్యాధికారి యగును. అపుడు త్రైలోక్యరాజ్యము మీ రాక్షసుల అధీనములోనికి వచ్చును.అపుడుదేవతలురాజ్యములేక దురవస్థల పాలగుదురు. కాలచక్ర పరిభ్రమణంబున మన అదృష్టములు క్రిందుమీదులగు చుండును. ఇపుడు రాజ్యములు పోయినవని విచారింపవలదు. దేవరాజ్యము బలిచక్రవర్తికి స్వాధీన మగునని పరమేశ్వరుడు చెప్పగా విన్నాను. నాకు మీ రెట్లు ష శిష్యులో అట్లే దేవతలు బృహస్పతికి శిష్యులు. అందుచే అతడు దేవతల క్షేమము గోరుచుండును. అతడు మాయ వేషములో వచ్చి మిమ్ము వంచించుటకు దేవతలపై అతనికి గల వాత్సల్యమే కారణము"అనగా విని దైత్యులు ప్రహ్లాదుని వెంట వెనుదిరిగి పోయిరి. పోయినవారు ఒకచోట గూడి "మనకు భుజపరాక్రమ మున్నది. ఈ విధముగా చేతకాని వారి వలె చేతులు ముడుచుకొని కూర్చుండు టెందుకు?దేవతలపై దండెత్తిపోయి దేవరాజ్యము నాక్రమింతము"అని ప్రహ్లాదు డెంత నివారించినను వినక దేవతలతో యుద్ధమాడి, వారిని తమ బలశౌర్యములతో స్వర్గమునుండి తరిమివేసిరి. రాక్షసపాలనలో యజ్ఞయాగములు మూలబడిపోయెను. అమరులకు హవిర్భాగములు లేక వారు బలహీనులై పోయిరి. వారొకచోట చేరి సుదీర్ఘముగా ఆలోచించి శుక్రుని కుమారులైన చండామార్కులను ప్రార్థించి "యజ్ఞములలో హవిర్భాగములకు రక్కసులను బిలువక మమ్ము పిలిచి మాకు హవిర్భాగము లిప్పింపు"మనిరి. వారు అంగీకరించి యజ్ఞములలో హవిర్భాగములు దేవతల కిప్పించిరి.వానితో బలవంతులైన దేవతలు స్వర్గము నాక్రమించిన రాక్షసులపై బడి వారి నుచముట్టుగ నాశనము చేసిరి. చావగా మిగిలినవారు, శుక్రుని శాపమున ఇట్లయితిమని విచారించుచు నిరాధారులై పాతాళలోకమునకు బోయిరి. ఎవ్వరి కైనను కాలగతిని తప్పించుకొనుట సాధ్యము కాదు గదా!

### నారాయణుని అవతారవిభూతులు

భృగుమహర్షి శాపమున శ్రీమన్నారాయణుడు మానవుడై యే డవతారము లెత్తెను. అందు మొదటిది,పృథుచక్రవర్తిరూపము. అతని చరిత్రమును ఇది వరకే తెలిసికొన్నాము గదా!రెండవదినరసింహావతారము. అపుడు హిరణ్యకశిపుని జంపెను. మూడవది వామనావతారము. బలిచక్రవర్తి రాజ్యమును యాచించిపుచ్చుకొని దేవతలకిచ్చెను. పదియవత్రేతాయుగములో ధర్మస్థాపనకై దత్తాత్రేయుడుగా జన్మించెను.

ఇది నాలుగవదైన మానుష విభూతి. పదునైదవ త్రేతాయుగములో మాంధాతగా బుట్టెను. ఇది యైదవ యవతారము. పందొమ్మిదవ త్రేతాయుగములో జమదగ్ని కుమారుడైన పరశురాముడుగా జన్మించెను. ఇది ఆరవ మానుషావతారము. ఇరువదినాలుగవ త్రేతాయుగములో దశరథపుత్రుడైన రాముడుగా జనించి రావణాది రాక్షసులను మడియించెను. ఇదే యేడవ అవతారము.

ఇక్కడితో భృగుమహర్షి శాపము వలన కలిగిన యవతారములు పూర్తి యైనవి.అయితే,పెచ్చు పెరుగుచున్నఅన్యాయ,అధర్మములకుఈ యవతారములు చాలలేదు.ఇరువదియెనిమిదవద్వాపరయుగములోధర్మ ప్రచారమునకై వేదవ్యాసుడుగా పుట్టెను. ఆ వెంటనే అదే యుగములో వసుదేవ కుమారుడైన శ్రీకృష్ణుడుగా అవతరించి రాక్షసాంశములతో అధర్మవర్తనులై చరించుచు, ధర్మమును అణచివేయుచున్న అనేక రాజులను తాను సంహరించియు, భారత యుద్ధమును నడిపించి, దానిలో ఒకరి నొకరు చంపుకొనునట్లు చేసియు భూభారమును తగ్గించెను.

ఈ విధముగా శ్రీమహావిష్ణువు అనేకావతారము లెత్తి బాలుడు ఆటలాడుకొన్నట్లువిహరించివినోదించుచుండును.ఆయనఅట్లుఎందుకు చేయుచున్నాడో తెలిసికొనగల శక్తి యెవరి కున్నది?అతడీ బ్రహ్మాండము లన్నింటిని తన సంకల్ప మాత్రమున సృష్టించి, పోషించి, తిరిగి తనలోనే లీనము చేసికొనుచు ప్రవర్తించు చుండును. అతనికన్న అధికుడు వే రెవ్వడును లేడు. ఇది అతని కొక వినోదము.

ఈ ఇరువది యెనిమిదవ కలియుగములో చివరి భాగమున, ధర్మము నామ మాత్రా వశిష్టమై యున్న సమయములో శ్రీమన్నారాయణుడు కలికి రూపమున విష్ణుయశుడను పేరుతో ఆవిర్భవించును. అప్పుడు అతనికి యాజ్ఞవల్క్యుడు పురోహితు డగును. ధర్మమార్గవర్తులగు కొందరు బ్రాహ్మణులతో, క్షత్రియులతోను) సైన్యమునుసమకూర్చుకొని,ధర్మదూషకులు,ధర్మకార్య విధ్వంసకులుఅగు ప్రాచ్యులను (తూర్పు దేశమువారిని), దాక్షిణాత్యులను, పశ్చిమ దేశ వాసులను, ఉత్తర దేశ నివాసులను, ఇతర యవన మ్లేచ్ఛ జాతుల వారిని సంహరించి మరల లోకములో ధర్మప్రతిష్ఠాపనము చేయును. ఇట్లు చేయుచునే, యింకను మిగిలిన యధర్మవర్తనులను అణచివేయుటకు తాను అదృశ్యరూపుడై వారిలో వారికి కలహములు పుట్టించి యుద్ధములు జరిపించి, నాశనము చేయును.

**కలియుగమున భవిష్యద్రాజుల చరిత్రము**

జరాసంధుని కొడుకు సహదేవు డనువాడు మహాభారత యుద్ధములో మరణించెను. వాని కుమారుడు సోమాపి. అతడు ఏబది ఎనిమిది సంవత్సరములు మగధ రాజ్యమును బాలించెను. దానికి రాజధాని గిరివ్రజ పురము. అతని కొడుకు శ్రుతశ్రవనుడు డెబ్బది యారేండ్లు రాజ్యపాలన చేసెను. అతని కుమారుడు అయుతాయువు ఇరువది యారు వత్సరములును, వాని కొడుకు నిరామిత్రుడు నూరేండ్లును, వాని కుమారుడు సుక్షత్రుడు ఏబది యారేండ్లును, అతని పుత్రుడు బృహత్కర్మ యిరువది మూడేండ్లును, పాలించిరి. సూతుడు మునులకీ కథలు చెప్పునాటికి సేనాజిత్తు రాజ్యమేలు చున్నాడు. ఇకముందు ఇతని కొడుకు నలువదేండ్లు పాలించును. వాని పుత్రుడు రిపుంజయుడు ముప్పది యైదేండ్లును, తరువాత క్షేముడు ఇరువది యెనిమిదేండ్లును, ఆపైన సువ్రతుడు ఇరువది నాలుగేండ్లును, వాని తరువాత ధర్మనేత్రు డైదేండ్లును, తరువాత సుశ్రముడు ముప్పది యెనిమిదేండ్లను, దృఢసేనుడు ఏబది యెనిమిది సంవత్సరములును, సుమతి ముప్పది మూడు సంవత్సరములును, సునేత్రుడు నలువదియేండ్లును, సత్యజిత్తు ఎనుబది మూడు వర్షములును, విశ్వజిత్తు ఇరువది యేండ్లును, తరువాత అరింజయు డేబది సంవత్సరములును పాలించెదరు. వీరందరును బృహద్రథులు (లేక బార్హద్రథులు) అనబడుదురు. బార్హద్రథులలో చివరి వాడగు అరింజయుని జంపి శునకు డనువాడు తనకుమారుడు ప్రద్యోతునికి పట్టము గట్టును. అతడు నిరుపమాన పరాక్రమశాలియై రాజుల జయించి చక్రవర్తియై యిరువది మూడేండ్లు భూమి నేలును. వాని కొడుకు ఇరువది నాలుగేండ్లును, వాని తరువాత విశాఖయూపుడు పదియేనేండ్లును, అజకుడు ఇరువది యొక్క వర్షములును, ఆర్యహితుడు ఇరువది యేండ్లును పాలించెదరు. ఇతడే నందివర్ధనుడని కూడ చెప్పబడును. ఈ యైదుగురు రాజులును ప్రాద్యోతు లనబడుదురు.

ఆ తరువాత వారి ప్రాబల్యమును అణచి శిశునాగు డనువాడు వారాణసిలో నుండి రాజ్యపాలనము చేయును. వీని పాలనా కాలము నలువ దేండ్లు. వాని కొడుకు కాకవర్ణుడు గిరివ్రజమును రాజధానిగా జేసికొని ముప్పది యారేండ్లు రాజ్యమును బాలించును. క్షేత్రధర్ముడు ఇరువదియేండ్లును, క్షత్రౌజసుడు నలువదేండ్లును, విధిసారుడు ముప్పది యెనిమిది వర్షములును,

అజాత శత్రువు ఇరువదియైదు వత్సరములును, దర్భకుడు ముప్పదియైదేండ్లును, ఉదయుడు ముప్పది మూడేండ్లును పాలింతురు. ఈ ఉదయుడు గంగానదికి దక్షిణతీరమున కుసుమ పురమును నిర్మించి దానిని రాజధానిగా జేసికొని పాలించును. వాని కొడుకు సహ(మహా)నంది నలువది మూడు ఏండ్లు భూమి నేలును. శిశునాగుడు మొదలు ఈ పదిమంది రాజులును క్షత్రబంధువులుగా పేరొందెదరు.

ఇంతకాలము ఇరువది నలుగురు ఇక్ష్వాకు రాజులును, పాంచాల రాజులు

ఇరువది యైదుగురును, కాలకు లనువారు నలుబది నలుగురును, హైహయులు నలువదినలుగురును,ఏకలింగులుముప్పదియిద్దరును,శకరాజులుఇరువదియైదుగురును, కురవరాజులు ముప్పది యారుగురును, మైథిలులు ఇరువదిమందియు, శూరసేను లిరువది ముగ్గురును, వీతిహోత్రు లిరువది మందియు పైవారికి సమకాలికులై నలుదెసల రాజ్యము లేర్పరచుకొని పాలింతురు.

ఒక శూద్ర స్త్రీ యందు మహానంది, మహాపద్మనందుడను కొడుకును గనును. అక్కడినుండి పాలకు లందరును శూద్రజాతివా రగుదురు. మహాపద్మనందుడు ఎనుబది వర్షములు పాలించును. వానికి ఎనమండుగురు కుమారులు ఉదయింతురు. వీరినే నవనందులు అందురు. వీరిని కౌటిల్యుడను బ్రాహ్మణుడు తన అపార బుద్ధిబలముచే నాశనము చేసి చంద్రగుప్తుని పట్టభద్రుని జేయును. అతడు ఇరువది నాలుగేండ్లు భూమి నేలును. వాని కొడుకు భద్ర(బింబి) సారుడు ఇరువదియైదేండ్లును, వాని కుమారుడు అశోకుడనువాడు ముప్పది యారేండ్లును, కుశాలుడు ఎనిమిదేండ్లును, బంధుపాలితుడుఎనిమిదేండ్లును,ఇంద్రపాలితుడుఏడేండ్లును, శతధన్వుడు (శతధనువు) ఏడేండ్లును, బృహద్రథుడు ఏడేండ్లును పాలింతురు. ఈ తొమ్మండుగురును మౌర్యు లనబడుదురు. బృహద్రథు డసమర్థుడై రాజ్యము పోగొట్టుకొనగా అతని సేనాపతి పుణ్య (పుష్య) మిత్రుడు అతనిని రక్షించి రాజ్యమున నిలుపును. అంతట అతడు మరల అరువదేండ్లు పాలించును. వాని తరువాత పుష్యమిత్రుని కొడుకు అగ్నిమిత్రుడు రాజ్యము నాక్రమించి యెనిమిదేండ్లు పాలించును. వాని కొడుకు సురజ్యేష్ఠుడు ఏడేండ్లును, ఆ తరువాత వసుమిత్రుడు పదేండ్లును, భద్రుడు రెండేండ్లును,పుళిందకుడుమూడేండ్లును,ఘోషుడుమూడేండ్లును, వజ్రమిత్రుడేడేండ్లును పాలింతురు. ఈ పదిమందిని శుంగవంశరాజు లందురు.

ఆ తరువాత రాజ్యము కణ్వుని వశ మగును. శుంగవంశములో కడపటి వాడైన దేవభూమి వ్యసనపరు డగుటచేత కణ్వాయనుడు (కణ్వుడు) వానిని వధించి రాజ్యము స్వాధీనము చేసికొని అయిదేండ్లు పాలించును. అతని కొడుకు భూమిమిత్రుడిరువది నాలుగేండ్లు పాలించును. తరువాత నారాయణుడు పండ్రెండేండ్లును, సుశర్మ నాలుగేండ్లును పాలింతురు. వీరిని కాణ్వాయను లందురు.

సుశర్మను వధించి సింధుకుడను ఆంధ్రరాజు రాజ్యము నాక్రమించుకొని యిరువది మూడేండ్లు పాలించును. వాని సోదరుడు కృష్ణుడు పదేండ్లును, వాని కొడుకు శాంతకర్ణి (శాతకర్ణియని ప్రసిద్ధి) మహాబలవంతుడై శత్రురాజులను గెలిచి యేబది యారు వర్షములు పాలించును. వాని కొడుకు ఆపోలవుడు పండ్రెండేండ్లును, పటుమంతు డిరువది నాలుగేండ్లును,అనిష్టకర్ముడిరువదియైదేండ్లును,హాలుడొక్క సంవత్సరమును, పత్తల్లకుడు అయిదేండ్లును, పురీషభీరుడు ఇరువది యొక్క వర్షములును, శాతకర్ణి ఒక సంవత్సరమును, శివస్వాతి యెనిమిదేండ్లును, గౌతమీ పుత్రు డిరువది యొక్క వర్షములును, యజ్ఞశ్రీశాతకర్ణి పందొమ్మిదేండ్లును, విజయు డారేండ్లును, దండశ్రీశాతకర్ణి మూడేండ్లును, పులోమారి (పులుమావిగా ప్రసిద్ధుడు) యేడేండ్లును పాలించెదరు. ఈ యాంధ్రరాజులు ముప్పదిమంది. వారి వంశములు మొదట ఐదుపాయలై తరువాత యేడువిధము లగును. వారి తరువాత ఈ రాజ్యము దశాభీర రాజుల వశమగును.

గర్దభిరాజు లేడుగురును, డెబ్బది రెండు సంవత్సరాలును, శకరాజులు పదిమంది మూడువందల యెనుబది యేండ్లును, యవనులు ఎనిమిదిమంది నూట యరువదేండ్లును, తుషారులు (యవనులు కావచ్చును) పదునలుగురు అయిదు వందలేండ్లును, గురుండులు పదుముగ్గురు రెండు వందల పదమూడేండ్లును, మైనులు పదునొకండుగురు తొంబది యెనిమిదేండ్లును, పరిపాలన చేయుదురు. వీరి తరువాత కిలకిలు డనురాజు భూమి నేలునుచ ఆ తరువాత వింధ్య శక్తియను వాడు వైదిక మార్గానువర్తియైయజ్ఞయాగాదులుచేయుచుతొంబది యారేండ్లు రాజ్యపాలన చేయును.

మధ్యలో చాలమంది రాజులు మారుచుందురు. చివరికి నైషధులను వారు మనువు పాలించునంతకాలము ఉందురు. కాని వీరి కాలములోనే అధర్మము ప్రబలును. యవనులు మున్నగు విదేశీయులు దేశము నాక్రమింతురు. అప్పుడు కలికిమూర్తి అవతరించి ధర్మప్రతిష్ఠాపనము చేయును.

# బ్రహ్మాండపురాణము

ఈ పురాణమును బ్రహ్మ నాకు చెప్పెను. నా దగ్గరనుండి శుక్రుడు వినెను. వానినుండి చాలమంది వినిరి. నేను ఉపదేశపూర్వకముగ వ్యాసుని నుండి గ్రహించితిని.

ఈ గురుపరంపరకు నమస్కరించవలెను. ఈ జగదుత్పత్తికి కారణుడును, యజ్ఞస్వరూపుడును,శ్రేష్ఠులలోశ్రేష్ఠుడునైనఆపరబ్రహ్మస్వరూపునకునమస్కారము"అని సూతుడు మునీంద్రులకు బ్రహ్మాండపురాణమును వినిపించెను.ఈ బ్రహ్మాండ పురాణమును సూతుని వలన విని మునులు ఆయా పర్వదినములందు పఠించుట చేత ఇది పురాతన పురాణమని చెప్పబడును. దీనిని సరిగా అవగాహన చేసికొనుచు పఠించిన వారికి సాక్షాత్తు బ్రహ్మత్వమే సిద్ధించును.

బ్రహ్మాండ పురాణము సమాప్తము